# గృహధర్మజ్ఞానము యొక్క
# ముఖ్యాంశములు




# SELECTIONS

FROM

# GRUHA DHARMODYANAMU.

## గృహధర్మోద్యానముయొక్క

## ముఖ్యాంశములు.

COMPILED BY

Rev. H. PEZZONI,



PRINTED BY B. K. SWAMY
AT THE VANI PRESS, BEZVADA.

1913.

# CONTENTS.

## విషయసూచిక.

# గృహధర్మోద్యానముయొక్క

## ముఖ్యాంశములు.

### ౧ వ- పర్వము.

#### క్రైస్తవునియొక్క గొప్పతనము.

అపరిమితమగు దేవకృపచేత క్రైస్తవులకు గలుగుచున్న గొప్పతనము, గౌరవము, అనే వాటి వలన పుణ్యమార్గమున నడచుటకు మరియొక గొప్ప కారణము గలదు. క్రైస్తవుడు తన విషయమయిన మహాత్మ్యమును బాగా గమనించినప్పటికిని పాపమగు దుర్బలతచేత దానికి అయోగ్యముగా నడవడు. ఒక రాజుచేత కుమారునిగా స్వీకరించబడిన వాడు బాగా నడచుటకు ఉద్దేశించును. తనస్థితియొక్క ఘనమున్ను మహిమయున్ను, చెడకుండా మిక్కిలి జాగ్రతగా నుండును. వాడు దుష్టులతో చేరి అయోగ్యతగా సంచరించినయెడల విశేషమయిన కీడున్ను, భీతియున్ను గలుగును. ఎందుకంటే వాడయోగ్యుడై సంచరించుచున్నాడని రాజుచూచి వాని ఉపేక్షించి తనపుత్రుడు గాడని నిందించి వానిని పరిహరించడా? అట్లు కీడు

తనకు రాకుండా క్రీస్తు పురుషుడు బాగా నడవవలసినది. ఏలనంటే వా డీలోకమందు స్వల్పకాలము సాధారణ మయిన అధికారముగల రాజుచేత గయికొన బడిన వాడుకాడు. అన్నిటికి అధిపతి అయిన సర్వేశ్వరుని చేతనే పిల్లవుగా స్వీకరించబడియుండెను. దీనిని బాగా కనుక్కొనుటకు క్రీస్తుని గొప్పతనమును కొంచమయిన ఆలోచింపవలసినది.

ఎట్లనగా, క్రీస్తు పురుషుడు అందరు మనుష్యులవలె సర్వేశ్వరునిచేత సృష్టించబడి వానిచేత రక్షించుట కున్ను కాపాడుటకున్ను మోక్షరాజ్యమునకు విధించ బడియుండెను. అట్టి గొప్పతనము ఇతరమనుష్యులకు సాధారణమయినప్పటికిన్ని ఇతరమతస్థులు సర్వేశ్వ రునకు చేయుచున్న ద్రోహమువలన ఆగొప్పతనమును పోగొట్టినప్పటికిన్ని అది తనకుమాత్రము స్వంత మయినట్లు అయినది. అది యేలననిన అజ్ఞానులు నిజ మయిన సర్వేశ్వరుని విడిచి, తమరు అబద్ధపుదేవుని నిర్ణ యించుకొని అతనిని సేవించుటచేత సర్వేశ్వరునకు ద్రోహులున్ను, పిశాచములకు దాసులున్ను అయి నిత్యమయిన నరకబాధలకు పాత్రులయిరి. క్రీస్తువు డయితే నిజమయిన సర్వేశ్వరుడు దేవుడుగానున్ను కర్తగానున్ను ఆరాధించుచున్నాడు. వానికి తాను సేవచేసి వాడునియమించుచున్న మోక్షరాజ్యమనే

బహుమానమునకు పాత్రుడగుచున్నాడు. ఇట్లు క్రైస్తవుడు సర్వేశ్వరునకు దాసుడుగా నుండుటచేత సర్వేశ్వరుడు వానిమీద అనుగ్రహించి మరువక విశేష దయచేత కాపాడుచున్నారని నమ్ముటకు చాలా హేతువులు గలవు.

౨వ- క్రైస్తవుడు జ్ఞానస్నానముచేతను యితరమైన దేవద్రవ్యానుమానముచేతను, భక్తిచేతను, దేవప్రేమచేతను, సర్వేశ్వరునితో నింకా సగ్గిర సంబంధము గలిగియున్నాడు. జ్ఞానస్నానముచేత సర్వేశ్వరుడు వానిని తనపిల్లవానిగా స్వీకరించును. అందులో క్రైస్తవుడు సర్వేశ్వరునకు నిజమైన జ్ఞానపిల్లడగుచున్నాడు. అందు జేసునాథస్వామియొక్క దివ్యరక్తఫలముచేత సుబుద్ధికరమయి సర్వేశ్వరునకు దేవాలయమగుచున్నాడు. భద్రమయిన యభ్యంగనముచేత ఇస్పిరితుసాంతు అనేవారున్ను దివ్యసత్ప్రసాదములో నున్న దేవకుమారుడయిన జేసునాథస్వామియున్ను అతని యాత్మలో నివసించుటచేత నతనికి మిక్కిలి సంతోషమున్ను, గొప్పతనమున్ను గలుగును. వాడు సర్వేశ్వరునకు స్వీకరించిన పిల్లడై అందువలన పరలోకరాజ్యము వానికి హక్కుగలదియగును. వాడు సర్వేశ్వరునకు తగినవాడై నడచినయెడల మోక్షరాజ్యము తప్పకతనికి దొరుకును. అందులో జేరుటకు తగిన

దేవానుగ్రహము వానికతగినట్లుడిగి యందుకు తగినట్లు కష్టపడినయెడల అందులో నిశ్చయముగా చేరి అతి సంతోషమును, మహిమను, పొందును. మరియు పర లోక రాణియగు పరిశుద్ధదేవతల్లి అతనికి ప్రీతిగల మాతగా నుండెను. దేవదూతలైన సంమనస్సులు, అతనికి కావలిగాను సహాయముగానుండును. సర్వే శ్వరునకు ప్రియస్నేహితులుగానుండే మోక్షవాసులు అతనికి సహోదరులే. ఇట్టిగొప్పతనము లన్నియు వానికి నుండుటచేత అతనికి నెట్టిమహాత్మ్యము! ఆగొప్ప తనమునకు తగినట్లు వుండుటకు ఇతనిమార్గము బహు బాగా నుండవలసినది. వాడు తనస్థితికి మహిమకు యోగ్యముగా నడచుటకు పిశాచమువలె గర్వము నొందక ఇతరదుర్గుణములను పొందక దేవకుమారుని వలె వినయముతో పరిశుద్ధముగా నడుచునుగాక.

## ౨వ. పర్వము.

## క్రీస్తువు లనుసరించవలసిన విశేషవిధులు.

ప్రియుడా వెనుకపర్వములో చెప్పినట్లు క్రీస్తు మతములో ప్రవేసించిన వారికి విశేషమహిమయును గొప్పతనమున్ను గలదు. అయితే వారు న్యాయసుల భములయిన కొన్ని కట్టడలకు విధేయులయి యుండ వలసినది. అవియేవంటే.

౧౮వది- జ్ఞానస్నాన సమయమున సర్వేశ్వరునితో చేసిన వాగ్దత్త ప్రకారము కొరత లేకుండా ననుసరించ వలయును. ఏలనంటేని ఆసమయములో నీకును సర్వేశ్వరునకును గొప్పప్రమాణము జరిగెను. నీవు సర్వేశ్వరుని ప్రేమగా విశ్వసించి వారి వేదకల్పనలను అనుసరించగలవనే ప్రమాణము నీపేరు చెప్పి యివ్వబడ్డది. అందువలన సర్వేశ్వరుడు తమ యభిమానపు పిల్లడుగా నంగీకరించుకొని తమ వరప్రసాదములకును మోక్షరాజ్యమునకును స్వతంత్ర మిచ్చుచున్నారు. నీప్రమాణము నెరవేర్చి అందుతో చేరిన వాగ్దత్తమును ప్రమాణికముగా ననుసరించినయెడల సర్వేశ్వరుడును తమమట్టుకు దానిని నెరవేర్చుదురు. నీవు దానినిమీరిన యెడల దేవకృపనున్ను సర్వేశ్వరుని స్వీకరపుపిల్లలనే పట్టమునున్ను, మోక్షస్వతంత్రమునున్ను, పోగొట్టుకొనుదువు. అట్టికీడు రాకుండునట్లు యెప్పుడును భక్తి విశ్వాసము నమ్మకము దేవప్రేమ మొదలయిన పుణ్యములను అనుసరించి సత్యవేద ప్రకారము ముఖ్యముగా నడుచుదువుగాత.

౨వది- పిశాచమును, దానియాడంబరమును చేష్టలను విడిచిపెడితినని జ్ఞానస్నానసమయములో నీపేరు చేత వాగ్దత్తమిచ్చినట్లు వాటిని సదా దూషించి తొలగించుదువుగాక. కాబట్టి అబద్ధపు దేవులయొక్క

ఆరాధనయున్ను అజ్ఞానపు పండుగులున్ను దుర్మార్గ మునకు హేతువులయిన కార్యములును, అన్నివిధ పాపములున్ను అసహ్యించుదురుగాక. గనుక సకల కార్యములు, ఉద్యోగము, లాభము, ఇతరకార్యము వీటినిబట్టి పిశాచారాధనకు, దానిపండుగులకును, దగ్గరసంబంధముగల ప్రతికార్యమును చేయగూడదు. అందునిమిత్తము ఉద్యోగముపోయినప్పటికిన్ని, అనేక ఉపద్రవములు సంభవించినప్పటికిన్ని, గొప్పసంగతి కాదు. ఇందువలన మోక్షానందము పొందవచ్చును గనుక అట్టిద్రోహమెప్పుడు సర్వేశ్వరునకు చెయ్య గూడదు. ఒనర్చినయెడల నిత్యమగు నరకబాధ గలుగును.

3వది- క్రైస్తువుడనే పేరున్ను పట్టమున్ను ఘన ముగాతలంచి ధైర్యముగా ధరించుదువుగాక. అర్చ శిష్టప్రకాశమనే రాజు ఫ్రెంచిరాజ్యపట్టముకంటె క్రైస్తువుడనే పట్టమును గొప్పగాతలంచెను. అందు వలన వారు రహస్యోత్తరములువ్రాసినప్పుడు ఫ్రెంచి రాజనేటిన్ని, ప్రకాస్ అనే సంతకము చెయ్యక బోయిాన్ గ్రామస్తుడయిన ప్రకాశఅనే సంతకము చేసెను. ఎందుకంటేని ఆస్థలమందు జ్ఞానస్నానము పొందెను. అతనివలె నీజ్ఞానస్నానమున్ను జ్ఞానస్నా నపుపేరున్ను క్రైస్తువుడనేపేరున్ను నీకుముఖ్యమైన

గౌరవమునితలంచి దానిని సంతోషముగా కొనియాడి పుణ్యమార్గమువలన దానిని గొప్పచేతువుగాక. భయశీలులవలె నీమతమును జ్ఞానస్నానపుపేరును క్రీస్తువుడనే మహిమగలపట్టమును దాచకు. జేసునాథస్వామి చాటించినదేమంటే- మనుష్యుల యెదుటనన్ను యెవడంగీకరించునో వానినినేను పరలోకములోనున్న నా దేవపిత దగ్గర నంగీకరించుదును. కాబట్టి మనుష్యుల ముందట నన్ను అంగీకరించనివాడెవ్వడో వానిని నేనున్ను పరలోకములోనున్న నాపితాదగ్గర వర్జించుదునని నిశ్చయించెను గనుక తాను దివ్యకర్తయొక్క శిశువు అనిన్ని క్రీస్తువుడనిన్ని సమ్మతించుటకు సిగ్గుపడిభీతినొందువాడుదివ్యకర్తకెంతమాత్రము తగనివాడు అవునని తెలియవచ్చును. అట్లుండగా క్రీస్తువులందరు భక్తిధైర్యములతో సత్యమతమును అనుసరించుదురుగాక. ఇప్పుడు కథోలికనే సత్యమతము అంతటాను ఈదేశములోను ప్రత్యక్షముగా ప్రసిద్ధమయి యుండుటచేత ఇటువయిని ఈమతము మట్టుకు పిరికితనముగా నుండుటకు కారణములేదు.

అజ్ఞానులు సిగ్గులేకుండా నబద్ధపు దేవులయొక్క గురుతులున్ను చెప్పశక్యముగాని సిగ్గుగల అపవిత్ర కార్యములయొక్క గురుతులయిన లింగము, తిరువణి మొదలయిన వస్తువులన్నిటిని గౌరవముగా ధరించు

కొనుచున్నారు. అట్లుండగా సత్యమతస్థులు తమదివ్య మతముయొక్క గురుతులను ధరించుటకు భయపడ వచ్చునా? అబద్ధమునకును, అపాపక్రమమునకును, మాత్రము సిగ్గుపడవచ్చునుగాని, సత్యమునకున్ను పుణ్యమునకున్ను సిగ్గుబడగూడదు.

౨వది- జ్ఞానము మొదలయిన అబద్ధపు మతస్థులు సత్యవేదమునకు విరోధములయిన అసహ్యములగు దూషణములకు భీతినొందక వాటిని శాంతముగా ఖండించి న్యాయముచూపించి తొణకకుండా సత్య వేదముయొక్క విశ్వాసమునందు ప్రమాణికముగా నుండవలసినది. అజ్ఞానులు క్రీస్తువేదమును మాలవేద మనే నిందమొదలయిన దూషణములకు భయపడ వలసిన అగత్యములేదు. ఆనింద మొదట బుద్ధిహీను లయిన వార్లను మత్తతజేసుటకు న్యాయము లేని యుపాయముగా అలవాటుచేసెను. అయితే సత్య వెలుగు ప్రత్యక్షముగా ప్రసరించుచున్న యీకాల మందు ఆదూషణము సత్యవేదమునుదూషించినవారి ముఖమందుబడును؛ అది యెట్లంటేని క్రీస్తుమతము సర్వేశ్వరునిచేత ప్రజలకు బోధించబడినదిగాని మాల వానిచేతను, తక్కిన మనుష్యులచేతను చెయ్యబడినది కాదు. ఈదివ్యమతము మొదట స్థాపించబడి ప్రబల మయిన దేశములో మాలవాండ్ర విభాగములేదు.

హిందూమతముగల యీదేశములోమాత్రము మాల వాండ్రుగలరు. వారువిష్ణుమతము, శివమతము మొదలయిన అనేకవిధములగు హిందూమతములలో ప్రవేసించియున్నారు. అందులో ఆరాధించబడే అబద్ధపు దేవులను వారు ఆరాధించుచున్నారు. హిందూ మతస్థులు తమపండుగులకు వారివలన అన్నిపనులున్ను చేయించుకొనుచున్నారు. అవియన్ని యట్లుండగా వారిమతములే మాలమతము లనతగినవి.

మరియు క్రైస్తువులు సర్వలోకమునకు సృష్టికర్తయయిన నిజమయిన సర్వేశ్వరుని ఆరాధించడమేగాని మరి యెవరిని దైవముగా నారాధించలేదు. అజ్ఞానులంటేని మాలవాండ్రకంటే తక్కువవర్ణము గల కొందరిని దేవతలుగా నారాధించుచున్నారు. ఏగాత, ఎల్లమ్మ మొదలయినవారి వర్ణమును నేను చెప్పనక్కరలేదు. వారివర్ణమందరికి తెలుసును. అట్టివారిని మొక్కేవారి వేదమే మాలవేద మనతగును.

హిందూ మతస్థులయొక్క జగన్నాధస్వామియొక్క కోవెలలో సమస్తవర్ణములవారు కలసివెళ్లుచున్నారు. వారందుకు విరోధపుమాటలేమిన్ని అనరు. అనేకస్థలములలో జరుగుచున్న శక్తిపూజలలో స్త్రీపురుషులును సకలవర్ణములవారును పాపదోషమునకు కలసియుండుటయేగాక అందులో నిషాచేసేవ సు

పులును, మాంసమును, వినియోగమవుతున్నదిగదా? అట్టియక్రమములగు అనాచారములు శక్తిపూజలలో జరుగుచున్నప్పటికిన్ని శక్తిపూజహిందూమతస్థులలో గొప్పదని తలంచబడుచున్నదిగదా ? మరియు పొగ బండిలోను, న్యాయస్థలములలోను, మరి యనేక స్థలములలోను అన్నికులములవారు కలసియున్నప్పటికిని అందుకు యెవరు యేమిఅనరు.

హిందువులు తమదేవతలను, మతములను వేర్వేరుగా నిర్ణయించుకొని ఒకడు విష్ణువే గొప్పదైవమనిన్ని, మరియొకడు శివుడే గొప్పదైవమనినయెడల ఇంకొకడు వారిని ఆరాధించక తనకులదేవతనయినా, అబద్ధపుదేవునినయినా, మరిదెయ్యం మొదలయిన దేవతలనయినా, పిశాచమునయినా, ఆరాధించినయెడల అందుకు ఎవరు విఘ్నముచెయ్యరు. అందునిమిత్తము కులమునుండి తప్పించక పెళ్లిపేరంటకము మొదలైన శుభాశుభములయందు రానిద్దురు. అయితే నెవడైన సత్యమతమును గనుగొని క్రైస్తువుడగుటకు ప్రయత్నించినయెడల అనేకులు వానికి విరోధులగుదురు. ఇట్టివానిని వర్ణమునుండిన్ని శుభాశుభములకున్ను రాకుండా తప్పించుతామని భయపెట్టుదురు. ఇవేగాక అనేక విఘ్నములు అన్యాయములు చేయుటకు భయపడరు. అయితే కథోలికనే సత్యమయిన క్రీస్తు

మతములో కులమునకు విరోధమయినది యేమియూ లేదు. అందులో సకలవర్ణములవారు కలసియున్నప్పటికిని పాపములేని వారివారి కులాచారములను అనుసరించుటకు ఆటంకములేదు.

మనకోవిలలో జాతిభేదమునకు తగిన శాసనమున్ను గలదు. సత్యమత గురువులు తమశక్తి కొలదిని యీ దేశాచారములను అనుసరించుచున్నారు. ఇవి ఇట్లుండగా ప్రతిదుష్టదేవతనున్ను అబద్ధపుదేవునిన్ని ఆరాధించుటకు విఘ్నముచేయనివారు సత్యమతములో ప్రవేసించుటకుమాత్రము విఘ్నమెందుకు చేతురు? సర్వకర్తయయిన నిజమయిన సర్వేశ్వరునిమాత్రము ఆరాధించకూడదనవచ్చునా? ఇట్టి దుర్మార్గముచేత తెలియబడ్డదేమంటేని హిందూమతములన్ని పిశాచారాధనగలవి. కాబట్టి హిందూమతమందు ఏమతములో ప్రవేసించినా లేక మతములన్నిటిని విడిచి నాస్తికులయినా పిశాచమునకులక్ష్యములేదు. అట్టివారందరు దానికి దాసులయియుందురు. నిజమైన సర్వేశ్వరుని మాత్రము ఆరాధించకూడదని పిశాచములును దాని దాసులగు హిందూమతస్థులును, చెప్పుదురు. ఏమంటేని పిశాచమునకు సర్వేశ్వరునియందు మిక్కిలి కోపము, తేజస్తిమిరములకును, నీళ్ళకును నిప్పుకును సత్యమునకును అబద్ధమునకును సంబంధములేనట్లు

అబద్ధమతమునకును, సత్యమతమునకును సంబంధము లేదు. అయితే ఇదే సత్యమతమునకు గౌరవము ఇదే బుద్ధిశాలులకు సత్య మతమును దృష్టాంతముగా చూపించగలదు. వీటినన్నిటిని బాగుగా నాలోచించి క్రైస్తవులున్ను ఆత్మరక్షణ పొందుటకు ఆశగలవా రందరును యీమతములయొక్క బూటకములను లక్ష్యపెట్టకయును జనవిరోధమునకు భయపడక యును పరమకర్త సహాయమునునమ్మి సత్యమైన క్రీస్తుమతమును అవలంబించి భక్తి విశ్వాసములచేత నది అనుసరించుదురుగాక.

అయితే నిజమయిన సర్వేశ్వరునిగూర్చి మత మునుగూర్చి పగబట్టినయెడల పరమకర్తకు విరో ధులయి తమరు తమదేశము సర్వేశ్వరుని కోపము వలన చెడుటకు కారణమగుదురు. వారుశిక్షలకు దండన చేయుదినము వచ్చుచున్నదని నిశ్చయముగా తెలుసు కొందురుగాక.

మరియు మతకార్యములలోను వర్ణభేదమును చాలాపాగిడే హిందూమతస్థులయిన పూర్వకవులు చెప్పినమాటలకు విరోధముగా నడుచుచున్నారు. ఈ దేశమందు మిక్కిలిపేరుబడ్డ నాలడియార్ అనే నీతి గ్రంథములో జెప్పిన రెండు అరవపద్యములయొక్క తాత్పర్యమేమంటే పెద్దలు పల్లపు భూమియందు

పుట్టిన ఉప్పు మెరకభూమియందు పుట్టిన ధాన్యము కంటే మంచిదియందురు. అట్లు నీచకులస్థులయినను పండితులైనయెడల మర్యాద చెయ్యవలసినది. మరియు మంచికులమనేదిన్ని చెడుకులమనేదిన్ని ఒట్టిమాట గాని అందులో కార్యమేమియు లేదు. మొదటినుండి గౌరవమును బొందినవిద్య, ధనము, తపస్సు, వృత్తి, వీటిచేతనే కులము. ఈకవులు మొదలయినవారు అనేకవిధములయిన గ్రంధములలో చెప్పినట్లు మంచి నడతయున్ను, విద్యయున్ను గలవాగే ఉత్తమకులస్థులు. అట్లుండగా సత్యమతమును తెలుసుకొనే విద్య అన్నివిద్యలలోను గొప్పది అగుటచేత సత్యవేదబోధ తెలిసిన క్రైస్తువులు మిక్కిలి మహిమగలవారనుట నిశ్చయము. ఈకవులను ఉదాహరణముగా చూపించి నందున వర్ణమును భ్రష్టుచేయుటకు మాకు తాత్ప ర్యమున్నదని తలంచవద్దు. వర్ణమును చటుక్కున చెడుపుటచేత యీదేశమందు మిక్కిలిగడబడయున్ను సత్యమత్తమునకు ఇంకాఅధికమయిన విఘ్నములున్ను గలుగును. అందువలన తలంపున్ను గూడదు. కాబట్టి ఆవ్యత్యాసము న్యాయమునకు విరోధముగా మిక్కిలి పొగడి తక్కువవర్ణములవారిని నిందించి అన్యాయముచేయుటయున్ను అందునిమిత్తము సత్యమతమునకు విరోధముచేయుటయున్ను మంచిదికాదని బోధిం

చుటకుమాత్రము తాత్పర్యము గలిగియున్నాము. ఆదియందు మనుకుల మొకటియే గలదు. దానిని సృజించిన సర్వేశ్వరుడొకడే. ఆయన మనుష్యులందరికి బోధించిన మత మొకటియే. వారు ఒక్క విధముగా మంచివారికి మోక్షమున్ను చెడ్డవాండ్రకు నరకమున్ను నియమించిరి. కాబట్టి వర్ణభేదము మధ్యరంగములో మనుష్యులచేత నేర్పరచబడి యీ దేశములో మాత్రము వాడుకయినదిగాని మరియెక్కడా లేదు.

### 3వ- పర్వము.

### పిశాచారాధన.

అజ్ఞానమనే అంధకారముచేత కప్పబడిన యీ దేశపు క్రైస్తవులలో కొందరజ్ఞానుల దుర్బోధ, దుర్మాత్రృక, పిశాచతంత్రము, ద్రవ్యాశదురాశాపాశములు మొదలయిన కారణములచేత మోసబడి అజ్ఞానముతో గూడిన అనేకవిధ కార్యములను జేసి సర్వేశ్వరునకు నందుచేత తగనివారయి తమపయిని, తమ కుటుంబముపయిని దేవకోపశిక్షను రప్పించుకొనుచున్నారు. అట్టికీడులు సంభవించకుండునట్లు ఆయజ్ఞాన కార్యములలో గలిగియున్న కీడులు అందరికి తెలియచేయుటకు మాకువిధియైయున్నది. ఆయక్రమములు పలువిధములుగానున్నందువలన క్రమముగా నొక్కొక్కటిగా తెలియచేతుము.

౧టిది. ఒకసర్వేశ్వరుడే గలడని సత్యమతము ముఖ్యముగా బోధించి అనేక దేవులుండగూడదని సత్య జ్ఞానమే దృష్టాంతముగాచూపించుచున్నది. ఏమంటేని సర్వేశ్వరుడనుదానికి అర్థమేమి? సర్వకర్తృత్వముగల వాడనిన్ని, సర్వమునకు గర్తయనిన్ని అర్థమగును. నిజమయిన సర్వేశ్వరుడు అన్నిటికిగర్తమైయున్నాడు అతనన్నిటినిసృజించి కాపాడుచున్నాడు. సకలమున్ను వారికర్తృత్వమునకు శక్తికిన్ని, సర్వవ్యాపకమునకు లోబడినది. సకలము వారిచేత పుట్టించబడినది. వారు మాత్రము అనాదిగా నిత్యముగానున్నారు. సర్వవల్లభత్వమున్ను సర్వనీతి మొదలయిన దైవలక్షణములు వారియందే గలవు గాని మరి యెవరియందు లేవు. ఇవన్ని ఇట్లుండగా వేరేదేవుడు గలడనుటకు అవకాశమున్ను విధమున్ను లేదు. సత్యమయిన సర్వేశ్వరునకు స్వంతమయి వారియొద్దనుండగా నితరదైవమునకు నేమియుండును? కాబట్టి ఒక కుటుంబములో నొకడే యజమానుడున్ను, ఒకరాజ్యములో నొకడే రాజున్నట్లు సర్వమునకు నొక సర్వేశ్వరుండుండును. అనేకదైవములున్నారనుట,సత్యవేదమునకున్ను, జ్ఞానమునకున్ను, తగని తప్పితము. అన్నియబద్ధములకంటే ఇదేగొప్ప అబద్ధము.

అజ్ఞానవంతులలో బుద్ధిశాలులయినట్టియు, అనే

కులయినట్టియు యీ దేశజనులు ఆరాధించే దేవులు నిజ
మయిన దేవులు కారనిన్ని, అన్నిటికి ఒకడే దేవుడనిన్ని
ఒప్పుకొని వానిని పరమాత్మ్యుష్టుడనిన్ని పరమబ్రహ్మ
యనిన్ని పరమకర్తయనిన్ని చెప్పుచున్నారు. కాబట్టి
హిందువులలో వారికి కొవెలయున్ను ఆరాధనయున్ను
లేదు. ఒకదేవుడేవున్నాడని ఒప్పుకొనేవారు సత్యమ
గు సర్వేశ్వరుని తెలుసుకొనుటకును, వారి మతనిబంధ
నలున్ను విని యనుసరించుటకును యశ్రద్ధగాను
న్నారు.

ఇప్పుడు చెప్పినట్లు సత్యమయినదేవుడు అన్నిటి
కిన్ని కర్తగానున్ను, సర్వలోకమునకు రాజుగానున్ను,
ఉండెను. కాబట్టి ఒకరాజ్యమందున్న నిజమయిన
రాజుకు విరోధముగా వేరేరాజును ఏర్పరచినయెడల
ఇది రాజద్రోహమని చెప్పుదురు. దీనికంటే సర్వలోక
మునకు రారాజుగానున్న సర్వేశ్వరునకువిరోధముగా
యనేక యబద్ధదేవులను ఏర్పరుచుట ఎట్టిదైవద్రోహ
ముగా నుండును. రాజయినవాడు తనను ఎదిరించిన
ద్రోహులను అతికఠినముగా దండించునట్లు నిజమైన
సర్వేశ్వరుడు అబద్ధపు దేవులను ఏర్పరచినవారినిన్ని,
వారిని ఆరాధించేవారినిన్ని, వారిసంబంధమయినకార్య
ములు చేయువారినిన్ని, మిక్కిలి శిక్షించుదురనుటకు
నిస్సందేహము.

ఈదేశపు దేవుళ్లారాధన దైవద్రోహముగానుండు టయేగాక మనస్సమాధానముగాని పిచ్చితనము. యేమంటేని, ఏకః అనేపేరు దేవునిపేరనియీదేశస్థులు ఒప్పుకొని అభ్యసించియుండగా ముప్పదిమూడుకోట్ల దేవతలున్నారని వారు చెప్పుటయెట్లు మనస్సమాధాన మగును, ఆదేవుల ఉత్పత్తిన్ని మనస్సమాధానము గాకుండ నేయున్నది. ఏమంటేని రామాయణములో జెప్పియున్న అదితియనే ఒక స్త్రీ ఆముప్పదిమూడు కోట్ల దేవతలనుకనెను. దానిసహోదరియైన దితి పిశాచులయిన రాక్షసులనుకనెను. ఈరెండు కుటుంబ ములకున్ను, కాశ్యపుడనే వాడొకడేతండ్రిగలడట. వీడున్ను ఆ అదితిఅనేదిన్ని దేవులుగారే. వారిబిడ్డ లెట్లు దేవులయిరి? వారియన్నదమ్ములు పిశాచులెట్లయిరి? మరియు ఆ కాశ్యపుడు ఆఅప్పచెల్లెలతో గలుసుకొని తుచ్ఛ వస్తువులయిన గాడిదె, తొండ మొదలయిన జంతువులను, గాలి, ఉరుము, మెరుపు, మొదలయిన వాటినికనెనట. ఇవన్ని మనస్సమాధానముగానికథలు గదా? మరియు యీదేశస్థులు సత్యమయిన దేవుని అరూపి అనుచున్నారే? అట్లుండగా స్త్రీపురుషులైన నానావిధరూపముగల దేవులను యేర్పరుచుట యెట్టి పిచ్చితనము.

ఈప్రశ్నను మనమతముపయిని త్రిప్పుటకయి

అజ్ఞానులకు నెంతయినా న్యాయములేదు. ఏమంటేని మేమారాధించే ప్రత్యేకసర్వేశ్వరుడు అరూపిగానున్ను, శరీరము లేకయున్నారు. ఆప్రత్యేక సర్వేశ్వరుడయిన అర్చశిష్ట త్రిత్వముయొక్క రెండవపురుషుడగు సుతు డయిన సర్వేశ్వరుడు దేవస్వభావములో యెప్పుడున్ను అరూపిగానుండగా మమ్మును రక్షించుటకు మనుష్య అవతారమెత్తుటచేత మనుష్యస్వభావముతో మను ష్యరూపమెత్తిరి. కాబట్టి వారెత్తిన మనుష్య స్వభా వముయొక్క ఆకారముగా వారి స్వరూపముచేసి నమస్కరించుట న్యాయము. మరియు మనుష్యస్వభా వములో వారికి మాతఅయిన పరమనాయకిన్ని, ఈ లోకమందు మిక్కిలి భక్తితో సర్వేశ్వరునకు సేవ చేసిన తరువాత స్వర్గమునొంది అర్చశిష్టులయినపుణ్య వంతులున్ను మనుష్య స్వభావముగలిగిన స్త్రీ పురు షులుగా నున్నందువలన వారివలె స్వరూపములుచే యుట న్యాయము. ఐతే తమపుణ్యముచేత వారు పర లోకములో సర్వేశ్వరునియొద్దపొందిన మోక్షానంద మునుబట్టి వారివలన మనకు గలుగుచున్న మేలులను, సహాయములనుబట్టిన్ని మేము వారినిన్ని వారి ఆకా రములయిన స్వరూపములనున్ను, నమస్కరించి నప్ప టికిన్ని వారినిదేవులనిన్ని, సర్వేశ్వరుడనిన్ని యెంత మాత్రము తలంచలేదు. దైవారాధన వారికి ఎంత

మాత్రము చెల్లించలేదు. ప్రత్యేకసర్వేశ్వరునిన్ని అర్చ శిష్టత్రిత్వములో నొకరయిన జేసునాధస్వామిని మాత్రము కర్తయనిన్ని సర్వేశ్వరుడనిన్ని ఆరాధించుతాము. కాబట్టి దేవమాతయున్ను అర్చశిష్టులున్ను పుణ్యముచేత సర్వేశ్వరునకు ప్రీతిగలవారయి వారిచేత పరలోకములో అత్యంతమహిమకు యేర్పరచబడుటచేత సర్వేశ్వరునకు స్తోత్రముగా వారికి తగినట్లు స్తోత్రనమస్కారములు చేయుచున్నాము. అజ్ఞానులయితే స్త్రీపురుషులయిన తమయబద్ధదేవులను వారి విగ్రహములను ఆరాధించుచున్నారుగాని వేరే దైవమును ఆరాధించలేదు. కాబట్టి యిందులో బొత్తిగా జ్ఞానమునకు విరోధముగా నడుచుచున్నారు. వారికిన్ని సత్యమతస్థులకున్ను, మిక్కిలి వ్యత్యాసముగలదు.

రవ-పర్వము.

పిశాచిసేవ.

సాధారణముగా క్రైస్తువులందరు పిశాచారాధనవిడచి ఉన్నప్పటికి కొందరు అందుకు సంబంధమయినసేవను, స్వల్పమయిన ఆదాయముకొరకు, తమ ఉద్యోగముకొరకు చేయుచున్నారు. ఇందువలన అనేకులు ఆత్మచెడుటనుబట్టి ఇట్టి పిశాచసేవలో గలిగియున్నకీడు చేతనయినమట్టుకు చూపించి దానిని తొలగించుటకు కావలసిన విధము తెలియచేయ

గలము. పిశాచారాధన చేయడము అందుకు సహా యముచేయుటయు గొప్పపాపము. ఒకానొకడు నిజ మయినరాజుకు ద్రోహిగానున్న దొంగరాజుకు సేవ చేస్తే నిజమయినరాజుకు ద్రోహియై శిక్షలకు పాత్రు డగుచున్నాడుగదా? అట్లే పిశాచమునుకొలచేవాడు సర్వమునకు రారాజయిన పరమకర్తకు ద్రోహియై నిత్య నరకబాధలకు పాత్రుడగుచున్నాడు.

౧౫౮ది- కాబట్టి అజ్ఞానరథోత్సవమునకును ఇంకా అనేక అజ్ఞానకృత్యములకును మేళతాళములు, మద్దెల నాగస్వరము మొదలయిన వాద్యములను వాయించే వారు సత్యవేదమునకు, సర్వేశ్వరునకుమిక్కిలిద్రోహు లయియున్నారు. అందువలన అర్చశిష్టపాపయినవారు అట్టివారిని కోవిలకు రాకుండాచేయుటకు గురువులకు ఖండనగా కట్టడయిచ్చిరి. కొన్ని సమయములలో గొప్పసంగతినిబట్టి అదినెరవేర్చుటకు తామసమయి నప్పటికిని ఆపిశాచసేవచేసినవారు కోవిలకురాకుండా చెయ్యుటకు తగియుండుటయేగాక ఆశిక్షను విధించే శాపమునకు లోబడియున్నారు. అట్టివారు పిశాచ సేవచేసే ఇతరమయిన పనివాండ్రును, తమ ఉద్యోగా వసరమునుబట్టి అట్లుచేయుచున్నాముగాని మరేమి లేదనిచెప్పుటకు న్యాయములేదు. ఏలనంటే అట్టి ద్రోహముచేయుటకంటే మంచి క్రైస్తవులు ప్రాణ

త్యాగమయినాచేతురు. ప్రాచీనులలోను ఈకాలము లోను అనేకవేదసాక్షులు పిశాచారాధనయును పిశాచసేవయును చెప్పశక్యముగాని కష్టమునొంది ఆస్తి గీస్తి మొదలయినవాటినిపోగొట్టుకొని ప్రాణమున్ను యిచ్చిరి. అట్లుండగా స్వల్పవసతి మొదలయినవాటిని పట్టి పిశాచమును సేవించుటచేత పిశాచులకు దాసులయి సర్వేశ్వరునకు మతమునకు ద్రోహులు కావచ్చునా? అట్టివసతివలన గలిగే ఫలమునుబట్టి ఆత్మను ఆపాపములో జేరియున్న తమబంధువుల ఆత్మను, చెడిపి నిత్యనరకబాధకు లోపర్చుటకు సమ్మతించవచ్చునా ?

కాబట్టి యట్టిదుఃఖస్థితిలోనుండేవారు చెయ్యవలసినదేమంటే, పిశాచసేవనున్ను, అందునిమిత్తము వచ్చుచున్న ఆదాయమున్ను విడిచి సర్కారుపనిన్ని, సమస్తానమునకు చెయ్యవలసిన అజ్ఞానసంబంధములేని పనులుమాత్రముచేసి వీటినిపట్టి నియమించియున్న ఆదాయమున్ను, హక్కున్ను, అనుభవించవచ్చును. ఎవరిని పిశాచసేవకు, దానిరథోత్సవమునకు బలత్కారము చెయ్యగూడదనిన్ని, ఎవడు తనమతములకు విరోధములయిన కార్యములు చెయ్యుటకు బలవంతపర్చగూడదనిన్ని ఇంగ్లీషువారు కట్టడిచేసియున్నారు. కాబట్టి మంచిమనస్సుగలవారు ప్రయత్నముచేస్తే తమ

హక్కుపనులలో అజ్ఞాన కార్యములన్ని ప్రసిద్ధముగా నెప్పుడు విడిచిబెట్టి అజ్ఞానసంబంధములేని పనులను మాత్రముచేసి రాబడిమాత్రము కాపాడు కొనవచ్చును. కొన్ని సంవత్సరములట్లనేకులు చేసినందున రక్షణ్యమార్గములో జేరిరి.

కాబట్టి ఎక్కడయినా అట్టిహక్కులో అజ్ఞానమయినవంతున్ను తీసి వేరుచెయ్యుటకుశక్తి లేకపోతే అగత్యముగా హక్కును బొత్తిగా నొదిలిపెట్టవలసినది. ఏలనంటే అంతకంటె తనఆత్మను మోక్షరాజ్యములో తనకు నియమించియున్న హక్కున్ను కాపాడుట యగత్యము. పిశాచసేవతో జేరిన ఆపని తమ శరీరసౌఖ్యమునకు విరోధముగానుంటే దానిని విడవకుండా జీవించకూడదని వారుచూచి దానిని విడవకుండా నుందురా? లేక కాటకము, సంకటము మొదలయిన యుపద్రవములలో తమప్రాణమును కాపాడుటకు తమయూరున్ను, గ్రామమున్ను, పల్లెలున్ను, విడువవలసినయెడల జీవించుటకు నితరగ్రామమునకు వెళ్లుదురు. అట్లు ప్రాణమును కాపాడుటకునెట్టి కార్యమయినా విడుచుదురు. కొన్నిసంవత్సరములు కొంత కాలము ఇహమందు జీవించుటకట్లు చేసినయెడల పరలోకమందు నిత్యముగా నపరిమితమయిన సంతోషముగా జీవించుటకు నట్లుచేయకుండా నుండవచ్చునా?

తమహక్కు విడిచినతరువాత జీవించమని తలంచకూడదు. ఈలోకములో జీవనోపాయము లనేకములు గలవు. చాలామంది పిశాచిసేవకు, తమహక్కును విడిచి బాగా బ్రతుకుచున్నారు. ఒకగ్రామములోజీవనాధారము లేనట్టయితే నితరగ్రామమునకువెళ్లి పనిపలనయినా లేక ఉద్యోగములో బ్రవేసించి అయినా బాగా బ్రతకవచ్చును. సర్వేశ్వరుడు తమకొరకు పిశాచసేవనున్ను, దాని లాభమునున్ను, విడిచినవారిని వదిలిపెట్టరు. వారినినమ్మి వారికి మంచిసేవచేసి తమజీవనాధారమునకు తగినకష్టమునొందితే బాగా జీవించుదురనుట నిస్సందేహాము.

౨వది- హక్కుగలవారయినా ఏపనిగలవారైనా రక్షణ్యాము పొందుటకు నిప్పుడు చెప్పినప్రకారము పిశాచసేవనుఅగత్యముగా విడుచుదురుగాక. కొందరు పరిచారకుల ఒంతు అనేక సంవత్సరముల కొచ్చిన ప్పటికిన్ని లేక కొన్నిసమయములలో మాత్రము అది సంభవించినా అట్టిపిశాచసేవ చెయ్యగూడదు. తమ ఒంతు సంభవించునపుడు ఆపిశాచిసేవచేయుటకు ఇష్టముగలవారు చావయిన పాపస్థితిలోనున్నారు. వారు దానినిబొత్తిగా విడిచేపర్యంతము పాపసంకీర్తనముచేసి సత్ప్రసాదము గయికొనుటకు పాత్రు

లుగానుండరు. అట్టి స్థితిలో వారు చనిపోతే నడ తెగని చేటుగలుగును.

ఆపిశాచసేవను బొత్తిగావిడిచిపెట్టినామనే అబద్ధపు మాటలచేత గురువులను మోసపర్చి దానిని నిజముగా ఒదిలిబెట్టునపుడు అబద్ధపు పాపసంకీర్తనముచేసి దేవద్రవ్యానుమానములను పుచ్చుకొన్నందున మిక్కిలిపాపమున్ను దేవద్రోహముగానుండును. కాబట్టి యట్టికపటము నెవరుచెయ్యకూడదు.

తాను చెయ్యకూడని పిశాచసేవ మరియెవరిచేత నయినా చేయించగూడదు. కాబట్టి తనకుబదులుగా మరియేఅజ్ఞానినయినా పంపించుటకును ఏర్పరుచుటకును గూడదు. ఏమంటే పాపముతగ్గక రెట్టింపగును. శత్రుసంహారము తాను చెయ్యక మరియొకనిచేత చేయించినయెడల రెట్టింపయిన పాపము గలుగును గదా ? అదిఎట్లంటే ఆసంహారపాతకమునకు వాడే కారణముగాకుండా దానిని మరియొకనిచేత చేయించుటచేత తనకును అతనికిని పాపము గలుగజేయుచున్నాగు పిశాచసేవగూడానట్టిదే. కాబట్టి ఆపిశాచ సేవ తను ఒదిలిపెట్టిన తరువాత మరియొకడు అది చేయుటకు ప్రయత్నించితే నట్లుచేయువానికిపాపము.

## ౧౮వ - పర్వము.

### చిల్లంగి గారిడీ మొదలయినవి.

౧౮టిది- హానిచేయుట గొప్పపాతకమనిన్ని హాని చేయువారు పాపాత్ములని యందరు ఒప్పుకుందురు. అట్లుండగా మనుష్యులను చంపుటకున్ను అనేకవిధ రోగములు, కీడులు సంభవించేటట్లు ప్రయత్నముచేసి చిల్లంగిబెట్టుట మిక్కిలి పాపముగల దురభ్యాసము. అందులో నితరులకు కీడుచేసేపాపము లేకుండానందుకు పిశాచముయొక్క సహాయమును పొందినపాపమున్ను గలసియున్నది. ఏమనగా చిల్లంగి పిశాచముయొక్క సహాయమువలన బెట్టుటయేగాని మరియేమి కాదు. చిల్లంగిగలవారిలో కొందరు పిశాచముతో ప్రత్యక్షముగా మాట్లాడడపు సంబంధము గలిగియున్నారు. కొందరు ప్రయోగించే సామాగ్రిమంత్రములు మొదలయినవాటితో రహస్య సంబంధముగలిగియున్నారు.

దీనినింబట్టి ఈభాగములోవున్న చాలావిశేషములనుగూర్చి సాధారణముగా కనుకోవలసినదేమంటే సత్యమతమునకు విరోధమయిన ఒకానొక కార్యమునకు ప్రయోగించుచున్న వస్తువులున్ను సాధనములున్ను, ఆయుధములున్ను స్వభావమున దానిని నెరవేర్చుటకు ఫలములేకపోయినప్పటికిన్ని వీటిచేతను

అవి నెరవేర్చితే అగత్యముగా పిశాచమే దానిని నెరవేర్చుచున్నది. పిశాచే ఆవస్తువులను, ఆయుధములను నియమించుచున్నది. వాటిని ప్రయోగించేవారు అందుచేత పిశాచముతో రహస్యమయిన సంబంధముగలిగి యున్నారు. ఇదిబాగా విచారించితే మంచివారు దానికి భయపడుదురుగాని ఎప్పుడు అట్టికార్యములు చెయ్యరు.

హిందూమతము పిశాచారాధనకు పుట్టగీటుగానుండుటచేత అందు చిల్లంగి మొదలయినవి అభ్యసించుటగొప్పకాదు. హిందూమతస్థులు మన్నించే చతుర్వేదములలో నాలవదయిన అధర్వణమువలన చిల్లంగి తెలియచెయ్యడమేగాక అందుకు మంత్రములుగూడా గలదయియున్నది.

పిశాచము మనుష్యులకు నేవిధముగానయినా కీడుచెయ్యుటకు తలంచియుండుట చిల్లంగిమూలముగా వారికి కీడుచేయుటకు సర్వదా కాచియున్నది. అది లోకమునకు ఆదియందు కయిన్ అనేవానిచేత ఆబల్ అనేవానిని చంపుటనుబట్టిన్ని, మొదటచంపేవాడుగానుండునని సువిశేషములో చెప్పబడియున్నది. కళ్యాణగుణస్వరూపిగానుండే సర్వేశ్వరుడయితే పుణ్యము మాత్రము బోధించే తనమతముచేత చిల్లంగిమొద

లయిన సకలపాపములు నిషేధించి అందుకు మిక్కిలి శిక్ష నియమించియున్నారు.

ఇవన్నియు ఇట్లుండగా చిల్లంగివిద్య మొదలైన వన్నియు మిక్కిలి చెడ్డపనులే. కాబట్టి అజ్ఞానముచేత మతిపోయిన హిందువులు చాలాగొప్పచేసే తమ ఇతర కళాజ్ఞానములలో రమారమి ఇతరగు కళాజ్ఞానములు బొత్తిగా చిల్లంగివిషయమేను. ఇట్లు నిజమైనవిద్యలను శాస్త్రములను మరచిపోయి మనుష్యులకు కీడయినవిద్యలను ముఖ్యపర్చిరి. అందుచేత ఈదేశమందు అనేక అక్రమములు, పాతకములు, కీడులు ప్రబలించినవి.

కాబట్టి చాలాపర్యాయములు స్వభావసిద్ధమైన రోగములువచ్చినప్పుడు చిల్లంగి పెట్టినారనేమాట అనేకులు అబద్ధముగా తలంచుచున్నారు. అందుచేత వ్యర్థముగా బుద్ధిహీనమయి వీరి వారిపయిని అన్యాయముగా అనుమానించి ఆచిల్లంగి తీయుటకు కాని పనులుచేసి గొప్పపాపమును కట్టుకొనుచున్నారు. సహజముగా రోగములనేకములుగలవు. అందులో కొన్ని అతిశయముగా కనపడినప్పటికి అవి చిల్లంగి వలన సంభవించినవని ఊరకే తలంచవద్దు. చిల్లంగి గలవారు చిల్లంగి బెట్టినప్పటికిన్ని అందువిషయము

యేమిచేసినప్పటికిన్ని సర్వేశ్వరుని చిత్తము లేకుండా నదిఫలించదు. అందువలన తరుచుగా భక్తిచేత పరిశుద్ధుడుగానున్న మంచి క్రైస్తవులువద్ద చిల్లంగి ఫలించదు. అట్లు బ్రాహ్మణులు ముక్తిపొందిన అరుళానందమనే వారినిచంపుటకు మరువదేశపురాజుయొక్క యెదుట కేకలువేసి అందుకు ననేకదినములు శత్రుసంహారముకొరకు పూజమొదలయినవిచేసి చిల్లంగిని పెట్టినప్పటికిన్ని వారికి ఏకీడు సంభవించకపోయెను. పూర్వమందు సిప్రియన్ అనేఒకచిల్లంగివాడు జూస్తినా అనే ఒక క్రైస్తవ స్త్రీకి తనపైని ప్రేమపుట్టునట్లు చిల్లంగిబెట్టినపిమ్మట ఇది ఆమెదగ్గిర ఫలించదనిన్ని మంచిక్రైస్తువులదగ్గిర యట్టివిద్య పనికిరాదనిన్ని వాడు పిశాచిమూలముగా తెలుసుకొని మనస్సుతిరిగి తనదుర్వ్యాపారములను విడిచిబెట్టినట్లే అట్టిహేతువచేత మనస్సుతిరిగి చిల్లంగిని అసహ్యించిన ఒకచిల్లంగి వానిని మేమే ఈదేశమందు తెలుసుకొంటిమి.

ఒకానొక సమయములో సర్వేశ్వరుడు ఒక క్రైస్తువుని పాపమునకు శిక్షగానయినా, మరిఏహేతువు చేతనయినా చిల్లంగివానివద్ద ఫలించుటకు సెలవిచ్చియున్నప్పటికిన్ని, అట్టి సమయములో నేమి చెయ్యవలసినదంటే కొన్నిసమయములలో చిల్లంగి గలవాడు చిల్లంగి బెట్టబడిన మనిషియింట్లో చిల్లంగి

సంబంధమయిన వస్తువులను ఉంచును. అందుకు మేకు కొట్టియుండును. లేక ఒకానొక హానికార్యము చేసి వుండును. అట్టికార్యములుండునేమో అని వెదకవచ్చును. అవి కనబడినయెడల వాటిని చెరుపుటమంచిది. సాధారణముగా అందువలన చిల్లంగిసమాప్తియగును అవిదొరకనియెడల చిల్లంగిబెట్టినవానిని కనుక్కొంటే అట్టి కార్యములను వాడెత్తి పాడుచేయుటకు వానిని స్వాధీనపర్చుకోవచ్చును లేక శక్యమయినంత మట్టుకు బలాత్కారము చెయ్యవచ్చును. కాబట్టి వానిమూలముగానయినా వేరే చిల్లంగివానిమూలముగానైనా ఏవిధచిల్లంగి పరిహారము చెయ్యకూడదు. ఏలనంటే నది యాచిల్లంగిని తీసివేయుటకు పిశాచమును సహాయముగాపిలిచి వేడి దానికి ఒకానొక బలియిచ్చినట్టును, దానికి సంబంధమయిన కార్యములనుచేసినట్టే అగును. మిక్కిలి ఘనమయిన పాపములయినందువలన శరీరమును కాపాడుటకు ఆత్మనుచెరిపి చంపేదోషమగును. అదియెట్లకీడు పిచ్చితనము ఒకరోగమును కొంతకాలమయినా సహించక అట్టిపాపముచేత ఆత్మనున్ను శరీరమునున్ను నిత్యనరకబాధలకు లోపర్చుటకు సమ్మతించుటకుసమాధానమే. అట్టిదోషమును చెయ్యకుండా సత్యమత సహాయమునుబొంది ఆచిల్లంగినిపోగొట్టవచ్చును. కాబట్టి యాకార్యమును గురువు

నద్గుప్పు [illegible]గు సూత్రించేటట్లు ప్రార్థించవలెనది,
మరియు అందునుగూర్చిజ్ఞానఔషధమయిన జపము, త
పము, ఉపవాసము, తీర్థము శిలువగురుతు జేసు మరి
యూసు అనేతిరునామములు దివ్యపూజ యివి మొద
లయిన తిరుసహాయములతో ఆకీడును తొలగించ
వచ్చును. ఒకానొకసమయములో నది వేగముగా పోక
పోతే దేవచిత్తప్రకారమే దేవకృప గలిగేవరకు
ఓర్పుతోనుండవలసినది.

చిల్లంగినిన్ని పిశాచసంబంధమయినమరియేవిద్య,
నయినా సర్వేశ్వరునిచేత మిక్కిలి ఖండనగా తొల
గించబడినపాపముగా నుండుటచేత ఏక్రైస్తువులైనా
ఎప్పుడును అట్టివిద్యను నేర్చుటయును చేయుటయును
యెంతమాత్రము తగదు. అట్టిపాతకము క్రైస్తువు
లలో దొరకదని తోచుచున్నది. కాబట్టి ఒకానొకడు
అదుర్వ్యాపారమునకు సిద్ధపడినయెడల సభనుండి
తొలగించుటకు పాత్రుడగును. ఎవరును అతనితో
స్నేహము చెయ్యకూడదు.

౨వది- మాయవిద్య తరుచుగా పిశాచ సహాయ
ముచేత నభ్యాసమయినందున పాప కార్యముగా
నుండును. మాయవిద్యగలవారు మనుష్యులకు నద్భు
తముగా కనువర్చుచున్నట్లు కార్యములను చేతురు.
మనుష్యులు బుద్ధికి, శక్తికి, మించినచాలాకార్యములను

చేతురు. పిశాచములు మనుష్యులకంటె బుద్ధి బలమున్ను శక్తిన్ని గలిగియుండుటచేతనున్ను వాటికి రూపము లేకపోవుటచేతనున్ను, మనుష్యులు చెయ్య శక్యముగాని కార్యములను పిశాచముయొక్క సహాయముచేత చేయవచ్చుననుటకునిస్సందేహము. అయితే నట్లు పిశాచముల సహాయముచేత మనుష్యులను మాయపర్చే కార్యములు మిక్కిలి పాపముగానుంటవి గనుక వాటినితరుచుగా ఆశ్చర్యముగా చూడగూడదు. ఏమంటే చూచేవారినిబట్టి అవిచేయబడుచున్నవిగాని చూచేవారు లేనియెడల ఆపాపము జరగదు.

కొన్ని సమయములలో సూక్ష్మశక్తిగలవారు తత్వశాస్త్ర సూక్ష్మశక్తిచేతనున్ను, కనుకట్టువిద్యచేతనున్ను, గొప్పగాకనుపర్చే కొద్ది కార్యములను చేతురు. మాయవిద్య లేకుండా నట్టివిద్యమాత్రముంటే దానిని చూచుటకు లవలేశమయినా తప్పులేదు. అయితే నీదేశములో నట్టిసూక్ష్మవిద్యలు చేయువారు మాయవిద్యను దానిలో చాలామార్లు కలుపుటచేతనున్ను లేక దీనిని దానిలో కలుపుటచేతనున్ను కలపకపోవుటచేతనున్ను, తెలియనందున వారివేడుకను తొలంగించుట ఉత్తమము.

## ౬ వ- పర్వము.

## మంత్రతంత్రములు.

భక్తి విశ్వాసములులేని కొందరు క్రైస్తవులు తమదగ్గిర ఒకపిల్లడయినా మరియెవరయినా చాలా దినములనుండి రోగముగానుంటే వారిని బాగుచేయుటకు చాలాకష్టపడి అనేకఔషధములనుయిచ్చి సర్వేశ్వరునియొద్దను అర్చుశిష్టులవారియొద్దను ఆరోగ్యమడిగినపిమ్మట కుదిరినది కాదని చూచి. కొన్ని సమయములయందు బుద్ధిలేక అబద్ధపుదేవులనుగూర్చి మ్రొక్కుదురు. లేక అజ్ఞానులనయినా, తురకలనయినా, పిలిచి రోగిని మంత్రించమనిచెప్పుదురు. కొందరురోగారంభము మొదలుకొని అట్లుచేతురు. ఇవన్నియు నిండా పిచ్చితనములున్ను మిక్కిలిపాపములేకాని మరేమి కావు. ఏలననిన మనుష్యులజీవనమును కాపాడుటకును తీయుటకును తగినవారెవరు? సర్వేశ్వరుడే- వారికి ఇష్టమయితేకాపాడుదురు. ఇష్టములేనియెడల రోగము వృద్ధిచేసి ప్రాణముపుచ్చుకొందురు. వారిచిత్తమునకు విరోధముగా మనుష్యులయినా పిశాచములయినా యేమిచేయును? అజ్ఞానులలోనున్న అబద్ధమతస్థుల లోనున్న మంత్రగాండ్రు పిశాచముయొక్క సేవకులుగా నున్నారనుటకు నిస్సందేహాము. వారినిబట్టి పిశాచియొద్దను ఆరోగ్యమునయినా మరియేమయినా

అడగవచ్చునా ? పిశాచము మనుష్యులకు ప్రాణ శత్రువుగదా ? మనుష్యులను చెరిపి నరకమునకు తీసుకవెళ్ళుటకు తాత్పర్యముగలదైయున్నది. అట్లుండగా మంచిచేయునట్లు గనపర్చుచు కీడుగలుగ జేయును. ప్రేమగలవేషమును గనపరిచి ప్రాణముపుచ్చుకొనే పాపాత్ములకు సమానమయినది. కాబట్టి అజ్ఞానులు మొదలయిన యెట్టిఅబద్ధపు మతస్థులను మంత్రగాండ్రమూలముగా రోగులను మంత్రపించుటయును వారియొద్ద విభూతిమొదలయిన వస్తువులను పట్టుకవచ్చి ఇవ్వడమున్ను లేక ఉంచుటయును మిక్కిలి పాపము. అందుచేత బంధువులు సర్వేశ్వరునకును మతమునకును రోగిని అత్యంతమయినకీడు చేయుచున్నారు. ఏమంటే- ఆమంత్ర తంత్రములు చెయ్యుటకు రోగి అంగీకరించినయెడల ఆఘనమగుపాపము అతనికి గలుగును. మరియు ఆపాపద్రోహముచేత సర్వేశ్వరునకు న్యాయమయిన ఆగ్రహము రావడముచేతఅనేక పర్యాయములు అట్టిసమయములో రోగికి అతిశీఘ్రముగా మరణము సంభవించును. ఇదిమేము అనేక పర్యాయములు దృష్టాంతముగా చూచితిమి. ఇంకా జీవించుటకు ఆశగల కొందరురోగులను మంత్రించుటకు బంధువులు అజ్ఞానులను పిలపించిరి. పిశాచమునకు లేక అబద్ధపుదేవులకు కోళ్ళుమొదలయిన బలు

లిచ్చి అజ్ఞానకృత్యములను చేయుచున్నారు. ఆపాప పరిహారమయేటందుకు ముందు శీఘ్రముగా ఆరోగికి ప్రాణముపోయెను. అట్లుదేవచిత్తమునకు విరోధముగా శరీరమును కాపాడుటకు విచారించి ఆత్మకును శరీరమునకును నిత్యకీడునురప్పించి ఆరోగులనునిత్యముగా నరకశిక్షకు లోపర్చిరి. అట్లుచేయువారు తాము న్న ఆగొప్పపాపమునకు ఎంతోకాలము ప్రాయశ్చిత్తము చెయ్యవలసినది. ఇవన్ని ఇట్లుండగా యెప్పుడును అజ్ఞానులచేతను ఆబద్ధపు మతస్థులచేతను క్రైస్తువులను మంత్రిపించుటకూడదు. పిశాచకోవిలకును అబద్ధపు దేవులకును మ్రొక్కకూడదు.

2వది- అజ్ఞాన వైద్యులును, తురకవైద్యులును చాలామార్లు వైద్యముజేయుచున్నప్పుడు మంత్ర విభూతిమొదలయిన పిశాచవస్తువులనుఇత్తురు. గనుక వారిని వైద్యముచెయ్యుటకు పిలుచుట తగదు. వేరే తగినవైద్యులు లేనియెడల అట్టివయిద్యులను చికిత్స చేయుటను పిలువవలసినఅగత్యమున్నయెడల మంత్రించకుండాను, మంత్రించినవస్తువులు ఇవ్వకుండాను వయిద్యముమాత్రము చెయ్యునట్లు ఖండనగా వారికి చెప్పి వేరేవిధముగా వారు చెయ్యకుండా జాగ్రతగా నుండవలసినది.

3వది- అట్లుపాములవాండ్రు మొదలైనవాండ్రు

పాములను పట్టుకొనుటకు ననేకపర్యాయములు మంత్రతంత్రములను ప్రయోగించుకొనుటచేత పాములను పట్టుకొనేటందుకు ఒకానొక సమయములో వారిని పిలుచుటకుఅగత్యమున్న యెడల వారు మంత్రతంత్రములను ప్రయోగించకుండునట్లు చెప్పవలసినది. వారు నాగస్వరమునుబట్టి ఆపాములనురావించి పట్టుకోవలసినది.

౧౭వది- క్రైస్తువులలో కొందరు రోగులను, మంత్రించుటకు సమయము కనుక్కొని మంత్రగాండ్రయి తిరుగుదురు. వారిమట్టుకు మిక్కిలి జాగ్రతగానుండవలసినది. ఏమంటేని- తరుచుగావారు మోసము చేయువారు. తాము పిశాచము నెదలగొట్టుతామని చెప్పి మరిగీర్ద, అమ్మోర్లైె, మొదలయినవి చదివి దానిని ఆవేశమునకు తెత్తురు. వారిలో కొందరు అజ్ఞానులవలెను తురకలవలెను మంత్రించుటకు అందు విషయమయిన మంత్రములను, సామాగ్రినిన్ని, చిల్లంగి సంబంధమైన వస్తువులనున్ను తమసంచిలో నుంచుకొనుటచూచితిమి. అట్టివారిట్లు చేయుటవలన దైవకోపమునకు కారణమగును. కాబట్టి వారిని ఖండనగా నిషేధించవలసినదేగాని వారిచేత నెవరిని మంత్రింపించకూడదు.

౧౮వది- కొందరు యాచకులు, ఉపదేశకులు,

బైరాగులు మొదలగువారును రోగులను మంత్రించుటకు వత్తురు. వారిచేతనయినా అదికుదరదు. దీనిని గూర్చి సాధారణముగా తెలుసుకోవలసిన దేమంటే. మంత్రించుటకు తగినపట్టమును బొందినవారు మంత్రపించవచ్చునేగాని మరియెవరు మంత్రపించగూడదు. మతవిరోధమయిన కార్యముచేసినయెడల సర్వేశ్వరునియొక్క ఆశీర్వాదము, కృప, గలుగదు. కాబట్టి రోగులను మంత్రపించవలసియుంటే సత్యమత గురువులచేతనే మంత్రపించవలసినది. అయితే, ఉపదేశకులు, బైరాగులు మొదలయినవారు ఇంటివారితో కలుసుకొని మోకాళ్ళపైనుండి రోగికొరకు సర్వేశ్వరుని వారి యర్చశిష్టలనున్ను వేడుకోవలసినది. అందుకొరకు యాచకులను బిలిచి వీరును వేడుకోవలయునని చెప్పి అందునిమిత్తము వీరికేదైనా ధర్మము చేసినయెడల దైవకృపగలుగును

౬వది- కొందరు తేలుకుట్టినవారికి ఆబాధపోవుటకు విశ్వాసమంత్రముచెప్పి పాతాళములో దిగి అనేమాటలను చెప్పినక్షణములోనే స్వామిని పాతాళములో విడచినట్లు అక్కడికి నిలుపుదురు. అది మన మంత్రమయినప్పటని అందులో సకముచెప్పి నిలుపుట అజ్ఞానమార్గమున్ను పిశాచసంబంధమయిన కార్యమున్ను అయినది. ఇట్లెంతమాత్రము చెయ్య

కూడదు. తేలుకాటుకు చాలా మందులు కలవు. వాటిని తగినట్లు యుపయోగించిన యెడల బాగౌను.

## ౭ వ పర్వము.

## సత్యవివాహ సంభ్రమపు దిట్టము, దానికి తగిన ప్రయత్నము.

వివాహము నేది కుటుంబములో నడచుచున్న కార్యములో ముఖ్యముగా నుండుటనుబట్టి అందుకు కొద్ది సంతోషమున్ను, ఆడంబరమున్ను, చేయుటకు న్యాయము గలదు. అయితే ఈ దేశములో అనేకులు అందుకు మిక్కిలి న్యాయమును తప్పుచున్నారు. అది ఎట్లంటే ఇతర దేశములో సాధారణముగా తమస్థితికి, తగిన తమ ఆస్తిలో స్వల్పవంతు పెండ్లి ఖర్చు చేతురే గాని తమకున్నదంత ఖర్చు చేయరు. అందుకు అప్పున్ను చేయరు. ఈ దేశములోనైతే అనేకులు తమస్థితికిమీరిన సంభ్రమమును, ఆడంబరమును, చేయుటకు మిక్కిలి అప్పుచేయుచున్నారు. అయితే అందువలన గలుగుచున్న కష్టము ఆలోచించరు. ఆ పెండ్లినిగూర్చి చేయుచున్న గౌరవమున్ను, ఆడంబరమున్ను, కొన్ని దినములలో పోవును. అవన్నియు అనేక వివాహములలో కాల్చే బాణాసంచా యొక్క భాగవలె మాయమగుచున్నవి. ఈ ఆడంబరమువలన ఇటువంటి సంభ

వించే కష్టము విస్తారము. అది ఎట్లంటే పెండ్లికొరకు అప్పుచేసిన సొమ్మునకు ప్రతిసంవత్సరము వృద్ధి యివ్వవలెను కష్టముగా నుండును. ఇవ్వనిగుడల వడ్డీకి వడ్డీ పెరిగి పిమ్మట తాను తీర్చశక్యముగాని ఋణవృద్ధి యగును. అట్లుండగా నప్పిచ్చినవారియొక్క తొందరచేతనున్ను, అప్పుయొక్క విచారముచేతనున్ను అందునిమిత్తము సంసారములో గలుగుచున్న దుఃఖపుమాటలచేతనున్ను, అప్పుతీర్చుటకు కష్టపడినయెడల అందుకొరకు అనుభవించవలసిన ఇబ్బందిచేతను అతికష్టముగలుగును. ఇట్లు రెండుమూడుదినముల వివాహమునకు వ్యర్థమయిన ఆడంబరము చేసినందున చిరకాలము దుఃఖపడి శ్రమనొందవలసి యుండును.

కొందరయితే తమకిష్టమయిన పటాటోపముతో వివాహము చేయుటకు అవకాశము గలుగువరకు అనేక సంవత్సరములు తమకైనా, తమపిల్లలకైనా పెండ్లి చేయక ఊరుకుందురు. అందుచేత అనేకులు తప్పి దుర్మార్గముగా నడచి తమ కీర్తికిని ఆత్మకును కీడు రప్పించుకొనుచున్నారు. కొందరు అందువలన ఎప్పటికిన్ని చెడుచున్నారు.

వలంగము గతార్ అనేవారిలో కొందరు వివాహమునకు తమవలన తీర్చశక్యముగాని అప్పుచేసి అందునిమిత్తము ఒకవిధ దాస్యరకము చేయుచుందు

రు. అట్లు పిమ్మట ఆత్మకార్యములలోను, మరి యితర కార్యములలోను, అనేక విధవిఘ్నములచేత శ్రమపొందుచున్నారు.

ఇవన్నియు అనేక ఆపదలకు కారణమగుటవలన అందరును వ్యర్థమయిన డంబమువిడచి ప్రతివారు తమస్థితికి తగినట్లు కావలసిన సమయములో పెండ్లి జేసుకొనుట యుక్తము. దరిద్రులు ధర్మవివాహము జేసుకొని తమకు తమదగ్గిర బంధువులకు సంతర్పణ జేయవచ్చును. కొంచ మవకాశముగలవారు తమస్థితికి తగినట్లు స్వల్పవ్యయము జేసి తమ బంధువులు మొదలయినవారికి సంతర్పణజేసి అట్లు సులభముగా పెండ్లి సానుకూలపర్చుట యుక్తము. అవకాశముగలవారైతే అజ్ఞానకృత్యము జేయక సంతోషముగా పెండ్లిజేసిన మొదల నారిష్టము. అయితే ఆడంబరము జేయుటకు తీరని అప్పు జేయువారు అందువలన ఘనవంతులగుదురా? అందువలన మేలేమియు పొందక పిమ్మట ఆపద నొందుటకు కారణమగుచున్నారు. కాబట్టి పైచెప్పినవన్నిటిని బాగుగా విచారించి తమస్థితికి తగినట్లు తమవివాహమునకు కట్టుదిట్టముగు ప్రయత్నము జేయవలసినది.

పెండ్లిజేసుకొనేవారిలో అనేకులు లౌకిక గొప్పతనము, సంభ్రమము, ఆడంబరము, ఇచ్ఛయించుటయేగాని సత్యవివాహమునకు కావలసిన ఆత్మప్రయత్నము

జేయుటకు కావలసిన ఆలోచన చేయుటము లేదు. అయితే నిదియే ప్రధానము. ఏలనఁగా పెండ్లికి దైవాశీర్వాదమున్న యెడల అందుకు కావలసిన సంతోషము గలుగును. ఐతే దైవాశీర్వాదము పొందకుండా జేయు సంభ్రమమున్ను, ఆడంబరమున్ను, వ్యర్థమైన పొగవలె ప్రయోజనము లేకపోవును.

శాశ్వతముగ గృహము కట్టుటకు తగిన పునాది వెయ్యవలయునుగదా? తగినపునాది వేసి ఆ గృహము కట్టినయెడల ఆయిల్లు నిలుచును. తగిన పునాది వెయ్యకుండా నేలకట్టినప్పటికి నిలువక వర్షకాలమందు పడి పోవును. అట్లుండగా తన జీవితకాలమువరకు స్థిరముగా నుండవలసిన వివాహ స్థితిలో తనకు దైవకృపవలన స్థిరమైన మేలున్ను, సంతోషము గలుగునట్లు అందుకు మంచిపునాదిగా మంచిప్రయత్నము చెయ్యవలసినదిగదా? ఈలోకమునకు సకలమేలులకు దేవకృప, ఆశీర్వాదము, ఆధారములుగా నున్నవి. కాబట్టి దేవ కృప ఆశీర్వాద[illegible] వివాహమునకు గలుగునట్లు జేయవలసిన ప్రయత్నము[illegible]?

౮వ పర్వము.

లోకపెండ్లియొక్క వివరము.

ముందు చెప్పినట్లు వివాహమునకు మంచిప్రయ

త్నము జేసిన సిమ్మట అందులో సర్వేశ్వరునకు తగని కార్యములు జేయుటవలన వారి దయయున్ను, ఇష్ట ప్రసాదమున్ను, పోకుండునట్లు జాగ్రతగా నుండవలసినది. కాబట్టి యందులో సజ్జ్ఞాన కార్యములున్ను మతమునకు విరోధమైన ఏ కార్యములున్ను జేయక మిక్కిలి ప్రమాణికముగా నుండవలసినది. దురాలోచనలకు స్థలమివ్వకయును, మరి యేతప్పులు చేయకయును, జాగ్రతగానుండురుగాక. వివాహమునకు నిజమయిన సర్వేశ్వరునిన్ని పిశాచమునున్ను పిలుపించకూడదు. జేసునాధస్వామి కానాయనే గ్రామములో జరిగిన వివాహమునకు తమ పరిశుద్ధ మాతయును శిష్యులతోను పిలువబడి గ్రామములో దయతో వేంచేసి వచ్చి ఆస్థలమున తమ మొదటి అద్భుతముచేసి ఆ వివాహమునకు విశేషముగా జ్ఞానసంతోషమున్ను ఆశీర్వాదమున్ను దయచేసినందున ఆదంపతులున్ను విశేషభాగ్యము నొందినారని యనుకుంటారు.' ప్రియులారా! జేసునాధస్వామియున్ను దేవమాత మొదలగు అర్చశిష్టులవారును మీ వివాహమునకు వచ్చునట్లు మీరు ఆశతో వారిని పిలిచిన మొదల అదృశ్యముగా వారు వేంచేసి వచ్చి ఆ వివాహమును గూర్చి ఆశీర్వదించుదురనుటకు సందేహము లేదు. ఐతే పిశాచమునుకూడా పిలిచినవారికి మనోదుఃఖము గలుగుననుట నిజము.

అయ్యో స్వామీ! మేము క్రైస్తవులమైతిమి మా పెండ్లికి పిశాచమును పిలుచుదుమా? ఇట్టికార్యమును తలంచవచ్చునా అని యనేకులు చెప్పుదురేమో అట్టి కార్యము తలంచుటయును, చేయుటయునుకూడదనుట నిజము. ఐతే ననేకులు ఆలోచించకుండా నట్టి ద్రోహము జేయుచున్నారు. అది ఎట్లంటె సర్వేశ్వరుడు తమ వేదములో మిక్కిలి ఖండనగా విసర్జించిన శకునశాస్త్రము వివాహమునుగూర్చి అడిగినా లేక అందులో అజ్ఞానకృత్యములను, లేక అజ్ఞానమునకు సంబంధమయిన మరి యెట్టికార్యములనయినా జేసినయెడల వివాహమునకు పిశాచమును పిలిచినట్లగును. మనుష్యులను చెడుపుటకు ప్రతిష్ఠలమున దూరి వెతకె ఆచెడ్డ శత్రువు విధులవలన ఆవివాహములో ప్రవేశించి యందులో దైవాశీర్వాదము గలుగుటకు విఘ్నముజేసి ఆవివాహమునకు పూర్వమందయినా పరమందయినా అనేక కీడులు గలుగుజేయుటకు కారణమగును. కాబట్టి పిశాచమునకున్ను అజ్ఞాన శకునశాస్త్రమునకును సంబధమయిన ఏకార్యమయినా చేయక జాగ్రతగా నుండవలసినది. అట్లుండగా మరికొందరు ఇట్టి కార్యములను ఇతరులుచేయకుండా ఇచ్చట వాటినివివరించెదము.

౧వది. అజ్ఞాన శకున శాస్త్రవిధులను అనుసరించుటలోనున్న గుడ్డితనమే.

అజ్ఞానమనే యంధకారము జేత గప్పబడిన ఈ దేశములో ననేకులు విద్యాహీనము జేత నజ్ఞానులయి యొక్క శకున శాస్త్రకృత్యములయందున్న అనృతములను, పాపములను, సరిగా గనుగొనక అనుసరించుచున్నారు. కొందరవి యబద్ధమునిన్ని తగనిదని ఒప్పుకొన్నప్పటికిన్ని విశ్వాసహీనముచేతను, చెడు అభ్యాసము జేతను, దురాత్మ్యము చేతను, ఒకానొక సమయములో బుద్ధిహీనులై తప్పుచున్నారు. కాబట్టి సుత్రత తీర్చినట్లు అట్టి కార్యములలో ఎంతో గొప్ప తెలివితక్కువవున్నదని తెలియజేస్తాము.

౧౮౮. కొందరు బ్రాహ్మణులయొద్దకైనా లేక అబద్ధపు శాస్త్రజ్ఞుల దగ్గరకైనా వెళ్ళి వివాహమునకు మంచి దినమున్ను, ముహూర్తమున్ను అడుగుదురు. ఇది వేదమునకు బుద్ధికి సమాధానము కానిసంగతి. అజ్ఞాన శకున శాస్త్రములను చెప్పే బ్రాహ్మణులు మొదలయినవారు పితలాటకము చేయువారని ఈ పుస్తకము ౧టి. భాగములో ౧౦వ. పర్వమునందు దృష్టాంతముగా చూపించితిమి. వారు నక్షత్రములను జూచి ముహూర్తములు చెప్పుదురనుట యబద్ధము. ఏమంటేని ముందు చెప్పినట్లే వారందరు ఏర్పర్చిన గణితములన్నియు సత్యజ్ఞానముగల విద్యకు తగనివి. మరియు నక్షత్రములకును మనుష్యులయొక్క వివాహము

నకును సంబంధమేమియును లేదు. మరియు ఏవ్యత్యా
సము లేక ప్రతిదినము ప్రతిఘడియ వివాహమునకును
ఇతర శుభకార్యములకును తగిన కాలము కాబట్టి ము
హూర్తమనేది అనర్ఘ్యమయిన అజ్ఞానపుమాట. రాహు
వు అనే కృష్ణసర్పము బట్టి కథయనిన్ని అది ఎంత
మాత్రము లేదనిన్ని ఆ పదోపర్వములో స్పష్టముగా
తెలియజేసితిమి. కాబట్టి బ్రాహ్మణులు మొదలయిన
వారిబద్దనైనా వివాహమునకు మంచిదినమున్ను ము
హూర్తమున్ను రాహుకాలమున్ను అడుగుట సర్వే
శ్వరునకు ద్రోహముగా నుండుటయేగాక మనస్సమా
ధానముగాని పిచ్చితనమే. ఆ దొంగశాస్త్రముయొ
క్క అబద్ధమునకు ప్రసిద్ధమయిన ఒకదృష్టాంతముగల
దు. అది ఏమంటేని ఇతరకులములో నుండుటకంటె
తాడు తెగినస్త్రీలు బ్రాహ్మణజాతిలో విశేషించియు
న్నారని అందరికి తెలిసేయున్నది. ఇదే వారిశాస్త్రము
నిదృష్టాంతముగా తెలియజేయుచున్నది అది ఎట్లంటే
ఇతరులను గూర్చి ఆలోచించుటకంటె తమకు తామే
మంచిదినము మంచిముహూర్తము మిక్కిలి శ్రద్ధగా
చూతురుగదా? వారి శాస్త్రము నిజమయిన యెడల
తమపుత్రికలయొక్క తాడు వేగముగా తెగునని కను
గొందురే. తెలుసుకొనినయెడల మిక్కిలి శ్రేష్టమయి
నదినమున్ను ముహూర్తమున్ను చూడరా? అట్లు చే

యుటకు వారికి తెలియనప్పుడు తమకే మంచిదినము ముహూర్తము నియమించుటకు వారికి తెలియదనుట నిశ్చయము. అది తమకే నియమించుటకు తెలియనప్పుడు ఇతరులకెట్లు నియమింపగలరు. కాబట్టి వారిశాస్త్రనుబద్ధము. వారిని యడుగుట బుద్ధిహీనము.

ఐనను వివాహదినము నియమించుటకు క్రైస్తవులలో అనేకులు అట్టి శకునశాస్త్రములను అనుసరించుచున్నారనుటకు నిస్సందేహము. ఎట్లనగా వివాహపటాటోపము చూడగా శుక్రవారములో వివాహముగుట యపరిమితములు. బుధవారములో అనేకము. సోమవారలక్ష్మీవారములలో కొన్ని జరుగుచున్నవి అని తెలియుచున్నవి. తక్కిన దినములలో స్వల్పము. స్వామి శ్రమపడిన దినమైన శుక్రవారములో తిరుసభ న్యాయముగా దుఃఖపడి తపస్సు జేయుట అనేక దినములనుండి ఏర్పడిన అభ్యాసము. అందుచేత నాదినమందు ఉపవాసము శుద్ధభోజనము మొదలైన తపఃకృత్యములు జరుగును. కాబట్టి అట్టి దినములో సత్యముతో కార్యములు వివాహమగుట మిక్కిలి యయుక్తము. ఈదేశమందైతే క్రైస్తవులట్టితపస్సు దుఃఖదినములలో ముఖ్యముగా తమ వివాహములను సంతోషముతో కొనియాడుట మిక్కిలి అవివేకము. అందులో ఎట్టి పిశాచముయొక్క తంత్రకలహము, మత్తత, ఉ

న్నదో ఏయే శకున శాస్త్రమున్నదో తెలియదు. ఎట్లయినప్పటికిన్ని అదిమంచి క్రైస్తవులకు తగదు. అగత్యమున్నయెడల ఆదినములో ఎంతమాత్రము వివాహాము చెయ్యకూడదనే నిషేధములేదు. అయితే ముఖ్యముగా ఆదినమున వివాహాముచేయుట చెడుఅభ్యాస మనుటకు నిస్సందేహాము. తపస్సు నిమిత్తము తిరుసభ నిషేధించిన దినములుతప్ప మరియేదినములలోనున్ను వివాహాము చేయవచ్చును. అయినను దేవదూతయొక్క ఆధారములోనున్న శనివారములోనున్ను దైవ కుటుంబముయొక్క యజమానుడైన అర్చశిష్ట జోసఫు అనేవారియొక్క ఆధారములోనున్న బుధవారములోనున్ను తోబియాస్ అనేవారికి మిక్కిలి మేలుకు హేతువైన వివాహాము చేయించిన అర్చశిష్టరపాహేల్ మొదలైన సంమనస్సులయొక్క ఆధారములోనున్న మంగళవారములోనున్ను దివ్యసత్ప్రసాదము స్థాపించిన దినముయిన లక్ష్మివారములోనున్ను ముఖ్యముగా వివాహాము చేసిన యెడలయు శ్రేష్టమే.

ఈ దేశపు అవరవాండ్రు ఆడిమాసములో వివాహాముచేయరు. అందుకు అనేకులు న్యాయమైనకారణములు చెప్పుటకలదు. కొందరు శకున శాస్త్రమున్ను కలుపుట కలదు. అందులోనట్టి శకునశాస్త్రము ననుసరింపక న్యాయమైన కారణముబట్టి ఆమాసములో

వివాహముచేయనియెడల తప్పులేదు. అన్యాయమైన కార్యములు ఏవంటే ఆమాసములో వివాహములు చేసినయెడల తొలికానుపు కనేకాలము ఎండకాలము గుటయును ఆడిమాసములో కాపువాండ్రకు మిక్కిలి పనిపాట్లు మొదలైన హేతువులుకలవు.

౨వది. అజ్ఞానులు పెండ్లియాడే స్త్రీలకు ముంగు సుడి, మెట్టనుదురు, ముఖమందుకంతులు, పొట్టిమెడ, పొట్టిజుత్తు, కలసిన బొమ్మలు, మొదలయినవికల స్త్రీలు తప్పులని తలంచి అవి దురదృష్టకారణములనిన్ని వా టిలో కొన్నిటివలన పెనిమిటికి మరణము సంభవించు నని ఈమొదలైన భయంకరమైన శకునశాస్త్రములను చూతురు. ఇవన్నియు బుద్ధిహీనమే. ముందు సుడి, ముఖమందు కంతులు, మొదలయినవి యుండుటచేత పెనిమిటికి మరణము సంభవించుటకు కారణమేమి? అందువలన దురదృష్ట కారణమేమి ? అట్టి శకున శా స్త్రమునకు పుట్టిగిటుఏమి? ముందుచెప్పిన లక్షణములు గల స్త్రీలు సద్గుణవతులుగానుండుటకు విఘ్న మేమి? వారు సద్గుణవతులుగా నున్నయెడల మంచి సంసారు లగుటకు విఘ్న మేమి? అట్లు ఆరవ ఎనిమిదవతరము లో జన్మించిన స్త్రీలను వివాహము జెయ్యబోయేగృ హమందు దరిద్రమైనా మరియెట్టి నిర్భాగ్యమైనా తే నుకు వతురని తలంచుదురు. అందుచేత వారికితగిన

స్థలమందు పెండ్లి కావడము కష్టము. అందుకు కారణమేమి? వారికి తప్పేమి? లోపమేమి? ఇవన్నియు పరిహాసించుటకు కారణములు. ఇంకావేరే అనేక కార్యములలో అట్టి దురదృష్ట శకునశాస్త్రములను అజ్ఞానులు చూచినయెడల సత్యమతముయొక్క జ్ఞానము తెలిసిన క్రైస్తవులు అట్టి యబద్ధమునుగూర్చి లజ్జించక దూషించవలసినది.

3వది. భక్తి విశ్వాస హీనముగల కొందరు క్రైస్తవులు తమ వివాహ కృత్యములలో అజ్ఞానులవలె చేయుటకు మూఢతగా నున్నారు. ఇది బుద్ధి న్యాయములకు తగనిది. ఏమంటేని అజ్ఞానులు తమ పెండ్లిలో నబద్ధమైన దేవుని మ్రొక్కుచున్నారని అనేకవిధ కార్యములను దేవునిగా ఏర్పర్చుచున్నారని అందరికి తెలిసియున్నది. అట్లు వారు తమ వివాహములలో పందిలిన్ని కుండదీపమున్ను దైవమందురు. రావిగాటనున్ను దైవమని గౌరవించుదురు. కొన్ని వర్ణముల వారు వివాహకృత్యములలో ఆడంబరముగా తీసుకొనివెళ్ళే కలశకులదైవమని భావించుదురు. అట్లుఅనేక వస్తువులను దైవముగా తలచి వాటికి పూజచేసి తమ వివాహకృత్యములో అనేకవిధ పిశాచారాధనలున్ను, అజ్ఞానకృత్యములున్ను, కలుపుదురు. అట్టి సమయములలో అన్యోన్యము చెప్పే మంత్రములున్ను, అజ్ఞానసం

బంధమైనవే. అట్లుండగా వారివలె చేయుటకు ఆసించు వారు అనేక అజ్ఞాన కృత్యములనుచేసి తమ వివాహములనుగూర్చి దేవకోపశిక్ష రప్పించుదురనుటకు సందేహము లేదు. నిజమయిన సర్వేశ్వరునిన్ని, సత్యమతమున్ను, జ్ఞానమున్ను తెలిసియున్న క్రైస్తవులు బుద్ధిహీనులై పిశాచములయిన అనేకవిధ అబద్ధదేవులను ఆరాధించుచున్న అజ్ఞానులను చూచి భావించవచ్చునా? అందువలన తమకు అనేక పాపములున్ను, కీడులున్ను. సంభవించవచ్చునని భయపడకుండా నుండవచ్చునా? కాబట్టి అజ్ఞానులవలెచేయు ఉద్దేశములను మాని సత్యమత విధి ప్రకారమే తమ వివాహము తగిన సంభ్రమముతో సానుకూలపర్చుటకు మాత్రము కనుక్కొందురుగాక, అజ్ఞానవిధులనున్ను మనస్సమాధానముగాని శకునశాస్త్రములను తొలగించి సర్వేశ్వరునకున్ను, మనుష్యులకును ప్రియమైన విధముగా పెండ్లిచేసుకోవచ్చును. కాబట్టి లోకపెండ్లియొక్క కృత్యములలో ఏదియజ్ఞానమో ఏది యజ్ఞానమునకుసంశయము గలదో వాటినన్నిటిని విడిచి పాపములేని కృత్యములను, ఆచారములను అనుసరించి క్రైస్తవులకు తగినట్లు వివాహము సానుకూలపర్చుకోవలయును.

---

## ౯వ పర్వము.

### అర్చుశిష్టపాపుగారిచే నిషేధించబడిన యజ్ఞానకృత్యములు.

ఆది కాలములో ననేకులు లోకపెండ్లిలో అజ్ఞానులవలె ననేకకృత్యములను అనుసరించుచున్నారని అర్చుశిష్ట పాపనేవారు కనుక్కొని రమారమి నూట యేబది సంవత్సరములనుండి తరుచుగా వాటిని నిషేధించిరి. వారు నిషేధించిన అజ్ఞానకృత్యములు ఇప్పుడు క్రైస్తవులలో సన్నగిల్లెను. ఐనను ఒకానొకరు బుద్ధిహీనముచేత వాటిని అనుసరించకుండా ఇచ్చట సూక్ష్మముగా వాటిని తెలియచేతుము.

౧టివది మంగళసూత్రముపైని గణపతి గురుతెంత మాత్రముంచకూడదు. అందులో క్రైస్తవులుఇపుడు సిలువగురుతు ఉంచుట మిక్కిలి ఉత్తమము.

౨వది- పుస్తెలబొందులో నూటయెనుబదిపోసలుంచగూడదని నిషేధించబడినది. ఏమంటేని శకున శాస్త్రము ఆలెక్కలో కలసియున్నది. అందులో గట్టికికావలసిన పోసలు మాత్రముంచవచ్చునేగాని శకునశాస్త్రముచేత ఒకలెక్క ననుసరించగూడదు. ఆనూటయెనిమిది పోసలబొందు ధరించే అజ్ఞానస్త్రీలు అందువలన నూటయెనిమిది సంవత్సరములు కాపురముచేతురా ? అందులో చాలామంది లే ప్రాయములో మరణమునొంది తాడుతెగినవారగుచున్నారు.

బ్రాహ్మణులలోవిశేషముగా ఇందుకు ఎన్నో దృష్టాంతములు గలవు.

3వది- దిగతుడుపు చిరకాలమునుండి మిక్కిలి ఖండనగా నిషేధించబడినప్పటికిన్ని ఇంకా అనేకులు అట్లుచేయుచున్నారనుటచేత గురువులకు మిక్కిలి విచారము. ఏలనంటే అదిబొత్తిగా అజ్ఞానకృత్యమనుటకు సందేహాములేదు. దృష్టితీయుటకు దానిని చేయుచున్నారనే కారణము మంచిదికాదు. అందు నిమిత్తము ఆకృత్యముచేయుట అజ్ఞానమే. దృష్టి మనస్సమాధానముగాని భయంకరముని మొదటిభాగమందు ఫదోషప్రశ్నములో తెలియజేసితిమి. అట్టి బుద్ధిహీనములయిన తలంపులు క్రైస్తవుల ఒద్ద నానుకవుట మిక్కిలి ఆశ్చర్యము. మరియు పిశాచము మొదలైన జ్ఞానశత్రువులవలన తమకు రాతగిన కీడులను తొలగించుటకు జేసునాథస్వామివారి ఆధారమున్ను వారి దివ్యనామమున్ను సిలువ గురుతున్ను సమనస్సుల సహాయమున్ను జపమున్ను తీర్థము మొదలయిన అనేక జ్ఞాన ఆయుధములుగలవు. స్వామియొక్కదయ మొదలయినమేలులు పోగొట్టి దిగతుడుపువలన పిశాచాధీనమునకును, దాని దాశ్యరికమునకును లోపర్చుటకు సమ్మతించడము ఎంతో బుద్ధిహీనము ! ఎంతో కీడు ! ఊరేగనము మొదలయినసమయములో దంష

తులకు గౌరవముగాను ఉపచారముగాను బంధువులు మొదలయినవారు ఒకానొక కృత్యముజేయుటకు ముఖ్యముగా నుద్దేశమున్న యెడల మునుపటివలె ననే కులు చేసినట్లు మంగళప్రదముగాను, సంతోషము గాను వారిపయిని పుష్పములను జల్లవచ్చును. లేక పన్నీరుజల్లవచ్చును. ఇటుపైని క్రైస్తవులందరుఅట్లు చేతురనినమ్ముచున్నాము. క్రైస్తవులవివాహములో వారికి స్నేహితులయిన అజ్ఞానులు వారికి దిగతుడు చుటకు వచ్చినయెడల వారిని అట్లు చెయ్యనియ్య కూడదు. అయితే పుష్పములుగాని పన్నీరుగాని జల్ల నియ్యవచ్చును. కొందరు దిగతుడుపుమానకయును, దానినిబొత్తిగా అజ్ఞానులవలె చెయ్యకయును కొంచ ముభేదముగా చేయుటనుబట్టి అందువలన తప్పులేదని తలంచుచున్నారు. అయితే దిగతుడుపుతీసేపాత్రలో దీపమున్ను పసపునీళ్ళున్ను ఉంచక ఒట్టినీళ్ళుమాత్ర ముంచినప్పటికిన్ని ఉంచకపోయినప్పటికిన్ని దిగతుడిచే కృత్యము సదాఅజ్ఞానమున్ను పాపమున్ను అగుటచే వాటినన్నిటిని బొత్తిగా విడవవలసినది.

౮వది- అజ్ఞానులు వివాహమునకు పాతినరాట కురావిరాటుఅనే పేరుపెట్టి అందుకు రావికొమ్మకట్టు దురు. ఇదివారు ఆరాధించే అబద్ధదైవమునకు సంబం ధమయినందున ఇది యెంతమాత్రము కట్టకూడదని

యర్చుశిష్టపాపనేవారు నిషేధించిరి. ఇందుకు ప్రతిని ధిగా ఏమయిన అబద్ధదైవముయొక్క గురుతయినమరి యొకకొమ్మనుకట్టినప్పటికిన్ని అదియుఅజ్ఞానమే. కాబట్టి సాధారణముగా క్రైస్తవులు అజ్ఞానమువిడచివేసినట్లు అందరు యెప్పటికిన్ని వీటినన్నిటిని విడచివేతురుగాక.

౫వది- పూర్వమందు లోకపెండ్లియొక్క సమారాధనలో కొందరు శకునశాస్త్రముగానయినా వేరే యజ్ఞానబుద్ధివలనయినా ఫలముల లెక్కలోనున్ను, గుణములోనున్ను పాత్రసంఖ్యలోను ఒకేవిధమునే అనుసరించుచున్నారని కనపడుచున్నది. అజ్ఞాన శకునశాస్త్రము కలసియున్న ఆనిబంధనలప్రకారము నిషేధించినట్లే మారిపోయెను. అట్టి కార్యములోనున్న అజ్ఞానమయిన చట్ట మనుసరించకూడదు.

౬వది- కొబ్బరికాయ కొట్టుటలోనున్ను వివాహమునకును శాస్త్రముచూతురని అర్చుశిష్టపాపయినవారు కనుకొని ఇదిన్ని అజ్ఞానశాస్త్రముగా నుండుటచేత అది వాడుకచెయ్యగూడదని నిషేధించి వివాహమందు కొబ్బరికాయ కొట్టకూడదనిన్ని లేక అది తినుటకయినా, పదార్థములో వేయుటకయినా అది కొట్టుటకు అగత్యమున్న యెడల దానిని వెల్లడిగాకొట్టకయును, అజ్ఞానకృత్యము లేకయును శాస్త్రముచూడకయును రహస్యముగా నట్టి యజ్ఞానకృత్యము లేని

విశ్వాసవంతులు అది కొట్టవలసినది అని అజ్ఞాపించిరి. ఇప్పుడు ఈప్రకారము నడచుట న్యాయము.

౭వది- ముందుచెప్పిన యజ్ఞానకృత్యములుగాక మరియనేక కృత్యములు అభ్యాసమగుటవలన వీటి నన్నిటిని తొలగించవలయునని అర్చిశిష్టపాపనేవారు కట్టడిచేసిరి. గనుక క్రైస్తవులు తమవివాహములో ఏవిధమయిన అజ్ఞానకృత్యములను అనుసరించక జాగ్రతగా నుండవలసినది.

౮వది- మరియనేక కృత్యములయొక్కవివరము.

ఈదేశమందు వాడుకయిన లోకపెండ్లియొక్క కృత్యములలో కొన్ని దోషములేని కులాచారములు అయినా దేశాచారములయినా, ఉన్నవనుటకు సందేహములేదు. అట్టికార్యములను నిషేధించుటకుమాకు ఎంతమాత్రము తాత్పర్యములేదు. ప్రతిదేశస్థులును, ప్రతికులస్థులున్ను సత్యమతమునకు విరోధముకాని తమ యాచారములను విడచివేయుటకు కట్టడయును లేదు. బలవంతమున్ను లేదు. అయితే ముందు అనేక దృష్టాంతములవలన తెలిసినట్లే ఈదేశాచార కులాచారములతో అజ్ఞానులు పలుపలు కృత్యములనైనా, శకునశాస్త్రములనయినా, కలిపినారనుట నిశ్చయము. వీటిని క్రైస్తవులు యెంతమాత్రము, అనుసరించ

కూడదు. కాబట్టి ఆయజ్ఞానకృత్యమును ఆచారము లను శకునశాస్త్రమును తొలగించి న్యాయమయిన ఆచారములను మాత్రమనుసరించవచ్చును.

౧౬౭౯౭- పెండ్లిచేయునపుడు ఇంటిలో చోటులేక పోయినా విశేషసంభ్రమము, అలంకారముచేసే హేతువుచేతనయినా పందిలివేయుటన్యాయము. ప్రతివారు తమస్థితికి తగినట్లు పందిలి యలంకరించుటకు విఘ్న మేమియు లేదు. అయితే నలంకారములోగాని, తక్కిన విషయములోగాని అజ్ఞానకృత్యమేమియుచేర్చక జాగ్రతగా నుందురుగాక. అజ్ఞానులు దానియొక్క మొదటి రాట ఈశాన్యదిక్కున పాతవలయునని శకునశాస్త్ర మును అనుసరించుదురు. మరికొందరు పందిలివేయు విధములోనున్న ఈశాస్త్రప్రకారము నడుచుదురు. అట్లుచేయకయును అందు శకునశాస్త్రమేమియు చూడకయును, గృహామునకును, స్థలమునకును తగి నట్లు పందిలివేయుటకు ఏదిక్కులోనయినా మొదటి రాట పాతవచ్చును. ఐనను అజ్ఞానుల గుడ్డితనమును అనుసరించక వారు ఈశాన్యమూలవిడచి వేరేదిక్కు న మొదటిరాట పాతినయెడల ఉత్తమము. పందిలి రాటల సంఖ్యలోను శకునశాస్త్ర మనుసరించకూ డదు. తన కులాచారమునకును లేక పందిలికి స్థలము నకు, తగినట్లు రాటలసంఖ్య నిర్ణయించవలయును.

౨వది- సర్వేశ్వరునికృపయును ఆశీర్వాదమున్ను వివాహామునకు గలుగునట్లు పందిలి మొదటిరాట పాతునప్పుడు అందుకు తగినభక్తిగల జపముచేయుట మంచి యభ్యాసమే. అయితే నాలుగుండలబండి పరు గెత్తుటకు ఆటంకమయిన ఐదవచక్రము చేర్చినట్లు అజ్ఞానులు పందిలిమోయని మరియొకరాట నందులో పాతి దానిని పలువిధముగా నలంకరించి తమ మన స్సులో దైవమునుద్దేశించి అందుకు చందనము మొద లయినవి పూసి దానికి మ్రొక్కుచున్నారు. క్రైస్తవులట్లుచేసినయెడల అజ్ఞానముగానున్నదనుటకు సందే హాములేదు. కాబట్టి యట్టియగత్యము లేని రాటను తీసివేసినయెడలమంచిది లేక చేయువివాహాము గొప్ప వృక్షమువలె వృద్ధిపొందవలెననే గురుతుగా నొకరా టను పాతుటకు ఇష్టమయినయెడల ఆనులుంచే స్థల ములో పాటుబడియును అజ్ఞానులవలె దానిని అలంక రించుటయును కూడదు. అర్చశిష్టజోజప్ అనేవారి వివాహామునకు పుష్పించిన పచ్చటికొమ్మ గురుతుగా పాతుటకు నాటంకములేదు. అయితే అందుకు రావి కొమ్మనయినా, మరియేకొమ్మనయినా, కట్టకయును రాటకు నమస్కారము మొదలయిన గౌరవముచేయ కయును, పందిలిలో యోగ్యమయినవిధముగా స్థాపించే

అర్చుశిష్ట సిలువకయినా అర్చుశిష్టదేవమాత స్వరూపమునకయినా అగౌరవము చెయ్యవచ్చును.

3వది- అజ్ఞానులు తమవివాహములో కుండదీప మనే ఒక విశేషమయిన దీపమును ఒక అజ్ఞానపూజ వలన తమతలంపులో దైవముగా భావించి దానిని పందిలిలో నొక పెద్దకుండమీాదనుంచి వివాహము య్యేమట్టుకు రాత్రింబగలు దానినికాపాడుచున్నారు అది యారిపోయిన యెడల దైవమువెళ్లిపోయినట్టు, వారితలంపులో మిక్కిలి దుశ్శకునముగా నుండును. ఇవన్ని యుఇట్లుండగా అజ్ఞానులవలె క్రీస్తువులు అట్టి దీపము నుంచగూడదు వారు పెండ్లిపందిలిలో దీప ముంచుటకు యిష్టమయినయెడల అది యజ్ఞానరీతిగా నుంచగూడదు. ఆయజ్ఞానులుంచు స్థలమందు అది యుంచుటయునుగూడదు. పందిట్లో స్థాపించియున్న దేవమాత మొదలయిన దివ్యస్వరూపమునకు యెదుట అందుకు గౌరవముగా నాదీపముంచవచ్చును. ఆస్వ రూపముయొక్క ఇరుప్రక్కల ఒకదీపమున్న యెడల యుక్తమే. గాలిమొదలయిన కారణములచేత నది యారిపోయినప్పటికిన్ని బుద్ధిహీనముగా నందువిషయ మయి శాస్త్రముచూడకూడదు.

4వది- క్రొత్తగా నొకకుటుంబము నేర్పరచిన పుడు అందుకుకావలసిన కుండలుమొదలయిన సామ

గ్రులు సంపాదించుట న్యాయమే. అయితే కొన్ని వర్ణములలో నజ్ఞానులు నందువిషయమై శాస్త్రము చూతురు. అది యట్లంటే అజ్ఞానియయిన కుమ్మరి వాడు చిన్న పెద్దకుండలను అతనికిచూపించిన స్థల ములో తీసుకొనివచ్చి వాటిని తన యజ్ఞానరీతిప్రకా రము మంత్రించి అజ్ఞానదైవమునకుఒప్పగించి వాటికి గొప్ప మ్రొక్కుబడిచేయును. అటుపైని పెండ్లివారు జతజతగా వాటిని సంభ్రమముతో నింటికితీసుకొనివెళ్లు దురు. ఇదియజ్ఞానకృత్యముగానుండుటనుబట్టి క్రైస్తు వులలో వాడుకలేకపోయెను. తెలియకపోవ్రుటచేత కొందరు యింకా దానిని అనుసరించియున్నప్పటికిని

ఇటుపయిని ఎంతమాత్రము అట్లుచేయకూడదు. వివాహమునకు క్రొత్తకుండలు మొదలయినవి కొనిన యెడల వాటికి తగని యెట్టికృత్యములనయినా చేయక తీసుకొని రావలయును. మరియు పెండ్లి పందిలిలో వాటిని యుంచతగిన హేతువుయేమంటేని జేసునాథ స్వామి నీటిని ద్రాక్షరసముగామార్చిన తమమొదటి యద్భుతమును కానాయనే గ్రామములో జరిగిన పెండ్లిలోచేసినారే ఆనీరునింపిన యారు జాడీలకు గురుతుగా నాకుండలనుంచవచ్చును.

౫వది- ముందుచెప్పినకుండలు అజ్ఞానులు పలు చిత్రములతో నలంకరించునపుడు అజ్ఞాన గురుతులను

చేర్చుదురనుటకు సందేహము లేదు. క్రైస్తవులు పెండ్లియుపయోగమునకయినా అలంకారమునకయినా ఉంచేకుండలను చిత్రవులతో నలంకరించుటకు నిష్టమయినయెడల అందులో అజ్ఞానగురుతున్ను అజ్ఞాన చిత్రమున్ను చేయకుండా నతిజాగ్రతగా నుండ వలసినది.

౬వది- కొన్ని స్థలములలో నజ్ఞానులు నదినుండి నయినా, చెరువునుండియైనా బాజా భజంత్రీలతోను విధులతోను, ఉదకము గైకొనివచ్చి దీపముంచిన కుండలో నిండాపోసి అందుకుపూజ చేతురు. గంగయనే పేరున్ను పెట్టుదురు. తరుచుగా క్రైస్తవులు ఈయజ్ఞానకృత్యము విడిచిపెట్టినట్లు అందరున్ను దానిని తొలగించుదురుగాక.

౭వది- మరికొన్ని స్థలములలో అజ్ఞానులు జలముచే నిండించబడిన చెంబుపూర్ణకలశ మనిన్ని కులదైవమనిన్ని లేక వివాహదైవమని తలంచి వివాహ కృత్యములో అది దంపతులయెదుట నుంచుదురు. మిక్కిలి సంభ్రమముతో తీసుకొనివెళ్ళుదురు. ఇది యజ్ఞాన కృత్యముగా నుండుటచేత క్రైస్తవులువాటిని యనుసరించకూడదు. అందులో పాటుబడిన స్వరూపముంచినప్పటికిని అజ్ఞానముతో మనమత కార్యములను చేర్చుటదోషము.

౮వది- పెండ్లినిమిత్తము తగువుగాయిచ్చే వస్తువు లలోనున్ను వాటినిపట్టుకొని వెళ్లువారిలోనున్ను వివాహకృత్యములు నడుచుదినములలోనున్ను పడుచునుపిలిచే పునిస్త్రీలలోనున్ను తక్కిన సకలకార్యములలోనున్ను సదా చేసిలెక్కననుసరించుచున్నారు. అనేకులు ఆలోచించక పరిపాటివలన అట్లు చెయ్యుచున్నారనుటసత్యమే. అయితే నిందులోమంచియదృష్టము శకునశాస్త్రము కలసియున్నదనుటకు సందేహము లేదు. ఏలనంటే ఈకార్యములోసరిలెక్కమాని వేసి బేసిసంఖ్యమాత్ర మనుసరించుటకు కారణమేమి సరిలెక్కలోదోషమేమి ? పెండ్లితగువుగా నిచ్చేవస్తువులలో మామూలుగా నొకవిధ మేర్పరచినపిమ్మట అందులో తక్కువచేసినయెడల మనుష్యులు తప్పు పట్టుటకును అధికముగా నిచ్చినయెడల కొందరికి లేని మామూలగుటకుకారణమగును. దానింబట్టిఅందులో మామూలుగానున్న సంఖ్యను మార్చుట కఠినముగా నున్నది. దానిని యనుసరించుటకు న్యాయమయిన కారణముండవచ్చును. ఏలనంటే ఇతరులకు ప్రత్యేకముగా తనకు తగువుయిచ్చినప్రకారము వారికితిరుగా ఇవ్వవలెననే కట్టడియగును. అయితే తగువుపట్టుకు వెళ్ళేవారిలోనున్ను మరియనేక కార్యములలోనున్ను బేసిలెక్క మార్చకుండా ననుసరించుటకు నగత్యమైన

ఒక హేతువున్ను లేదు. వేరేవిధమనుసరించుటకువిఘ్న మున్ను లేదు. మరియు లెక్కలలోనైనా జ్ఞానకారణ మనుసరించక వాటినిగూర్చి మనస్సులో నుంచవలసిన మంచి హేతువు యిపుడు చెప్పుదుము. సర్వేశ్వరుడేక ముగానుండుటనుబట్టి యొకటిన్ని ప్రాచీన వేదమున్ను నవీన వేదమున్ను, ఈ రెండు వేదములుండగా, రెండున్ను అర్చిశిష్ట త్రిత్వముయొక్క ముగ్గురినిగూర్చి మూడున్ను, నాలుగు సువిశేషములనుగూర్చి నాలుగున్ను జేసు క్రీస్తునాథుని అయిదుదివ్యగాయములనుగూర్చి అయిదున్ను, లేక దేవమాతయొక్క అయిదు మహిమ రహస్యములను గూర్చిఅయిదున్ను, కానాఅనే గ్రామములో జేసునాథస్వామి ద్రాక్షరసముగా మార్చిన జలముతో నిండిన ఆరుజాడీలనుగూర్చి ఆరున్ను, ఏడు దేవద్రవ్యానుమానములనుగూర్చి ఏడున్ను, సువిశేషములయొక్క అష్టభాగ్యములనుగూర్చి ఎనిమిదిన్ని, సమ్మనస్సులయొక్క నవవిలాసములనుగూర్చి తొమ్మిదిన్ని, పది దైవకల్పనలనుగూర్చి పదిన్ని, అర్చిశిష్ట ఉరుసూలమ్మతో వేదసాక్షులయిన పదకొండు వేల కన్యకలనుగూర్చి పదకొండున్ను, పన్నెండు అపోస్తులనుగూర్చి పన్రెండున్ను, అనేకసంఖ్యలనుముఖ్యముగా ప్రయోగించుకొనవచ్చును. ఇట్లు జేసి లెక్కవలె సరిలెక్కను ఉపయోగపర్చుట మంచి కారణముగా

నుండుటయేగాని వీటివలన దురదృష్టము మొదలైన యెట్టికీడులున్ను సంభవించవు. కాబట్టి చేసిలెక్క యొక్క దృఢమయినయభ్యాసము బుద్ధిమంతులున్ను విశ్వాసముగలవారున్ను ముఖ్యముగా విడిచివేతురు గాక.

౯వది- పెండ్లిపందిలియొక్క రాటక్రింద నవధాన్యములు జల్లుటయును అవిశీఘ్రముగా మొలచునట్లు పాలుపోయుటయును ఈదేశములో సాధారణమయిన మామూలు. క్రొత్తసంసారములో నవధాన్యములతో సకలమేలులు గలగవలయుననే దీవనముయొక్క అపేక్షకు గురుతుగా వీటినన్నిటిని చేసిన యెడల అందులో దోషము విఘ్నము లేదు. అయితే ఆధాన్యము బాగా మొలచినవో లేదో అనిచూచి యందువలన ఆపెండ్లి విషయమయిన శుభాశుభములకు శకునశాస్త్రము చూచుటయున్ను అట్లుచేసినా లేక యేహేతువువల్ల జల్లియున్నప్పటికిన్ని ఆఖరున ఆశాస్త్రము చూచిన యెడల చెయ్యరానికార్యమే.

౧౦వది- వివాహములో దంపతులనుగూర్చి సంభ్రమము చేయబడుటచేత వారందరికి కనబడునట్లు ఒకతీనెపయిని వారిని కూర్చుండబెట్టుటన్యాయము. కుర్చీలు వాడుకగలస్థలములో వారిని కుర్చిమీద కూర్చుండబెట్టుటమంచిదే. ఇతరస్థలములో వారికి

కళ్యాణమంటపమని ఒక తీనెవేతురు. కొన్నిస్థలముల లోనది పలకలుం కట్టుదురు ఇతరస్థలములలోనయితే మంటిలో వేతురు. వీటియన్నిటిలోను తప్పేమిలేదు. అయితే కొన్నిస్థలములలో ఆతీనెపుట్టమంటిలో నైనా లేక మరి యేమంటిలోనయినా వేతురు. అవిశేషమయిన మంటి విధములు మిక్కిలి స్థిరముగానుండుటనుబట్టి వాటిని యందుకు ఉపయోగపర్చినందున దోషములేదు. అయితే అవి మిక్కిలి పరిశుద్ధముగలవని ఈమొదలయిన అజ్ఞానహేతువులనుబట్టి ఉపయోగపరిచినయెడల అదియును అజ్ఞానమే.

మరియు కొందరు ఆతీనెపైని ధాన్యముపరచి అందుపైని దంపతులను కూర్చుండబెట్టుదురు. ఆక్రొత్తదంపతులు ధాన్యపురాశిపైని కూర్చుండినట్లే ధనములో వృద్ధిపొందవలెనని దీవన శుభాపేక్ష తెలియచేసే కారణమువలన ఇది వాడుక అవుతుందని తలంచుచున్నాము. కాబట్టి యందులో తప్పులేదు. కొందరా ధాన్యము పర్చుటకుముందు పలురంగులుగల ముగ్గు పెట్టుదురు. అలంకారమునకుమాత్రమే మిట్లుచేసిన అందులోవిఘ్నములేదు. అట్టిముగ్గులు పెట్టుటచేత నజ్ఞానశాస్త్ర గురుతులను జేర్చినయెడల తప్పుగానుండును.

పెండ్లి తీనెపైనియయినా కుర్చీమీదనైనాదంప

తులగత్యముగా తూర్పుదిక్కుగా కూర్చుండవలయు నని యనుటయును అజ్ఞానశాస్త్రమే. ఏదిక్కుగాకూర్చుండినను సరే. జేసునాధస్వామి ఈలోకమందవతరించుటవలన లోకమునకు జ్ఞానప్రకాశము కలిగినందున వారు ఉదయించు సూర్యుడనిన్ని వారిపరిశుద్ధమాత ఉదయనక్షత్రమనిన్ని వేదవాక్యములో జెప్పబడియున్నది. కాబట్టి వారినిగూర్చి తూర్పుదిక్కుచూస్తే విశేషముగా పండితుల్లో జేసునాధస్వామియొక్కయు, దేవమాతయొక్కయు స్వరూపము ఆదిక్కులోనుంచిన యెడల మంచిది.

౧౧వది- నలుగుఅనే కృత్యము దంపతుల యేచిన్నవాండ్రయొక్క విశేషమయిన సిగ్గుతీర్చుటకు యేర్పరచబడినదో లేక ఆటమొదలయిన మరియేకారణమునకు యేర్పరచబడినదో బాగుగాదెలియలేదు. ఆకృత్యమును స్త్రీలు స్త్రీలతోనున్ను పురుషులు పురుషులతోనున్ను చేసినపక్షమందు ఉత్తమము. అయినను అదియిప్పుడు వాడుకయినట్టు తగినమర్యాదతో తగినపాట లేకుండాచేసినయెడల తప్పులేదు.

౧౨వది- కొన్నివర్ణములలో కంకణముగట్టుదురు ఈదేశపు వాడుకప్రకారము కంకణమనేది పొంతనమునకుగురుతు. మరణపర్యంతము పతివ్రతగానుండుటకు గురుతుగానున్ను అందుకు పొంతనముగానున్ను

అదికట్టినయెడల మంచిహేతువే. పెండ్లికూతురు తన పెనిమిటికి స్వాధీనమగుననే గురుతుగా వీను ఆమెకు కంకణము గట్టినపుడు ఆమెయొక్క కాలి వ్రేళ్ళను మెల్లిగా త్రొక్కును.

౧౩వది- బాసికముకట్టు కృత్యములో ఆ త్తల యినా మరియొక స్త్రీయైనా పెండ్లికూతురికి ఇంట్లో యిచ్చే అధికారపు గురుతుగా ఒక బంగారపు రేకు ఆమెయొక్క నొసటిలో కట్టును. ఈకృత్యముకు విఘ్న మేమియు లేదు.

౧౪వది- తలంబ్రాలనే కృత్యములో పెండ్లివార యిన పురుషులు దంపతులకు ఐశ్వర్యము కలగవలసి నది అని దీవించి వారిపయిని యక్షతలు జల్లుదురు. ఇందువిఘ్న మేమియు కానము.

౧౫వది- సన్నికల్లు త్రొక్కే కృత్యము అజ్ఞానుల లో వాడుకపుచున్నది. అది యెట్లంటేని పెనిమిటి తన భార్యకాలును సన్నికల్లుపయినుంచి దానిని త్రొక్కు మని చెప్పి సప్తర్షిసముదాయమునకు దగ్గరయున్న యరుంధతియనే నక్షత్రమును చూడమని చెప్పును. ఆకృత్యమునకు అర్థమేమంటేని దేవేంద్రునితో పొంది న గౌతమఋషియొక్క భార్యయయిన అహల్యయనే ది సన్నికల్లు చేతనున్ను, తన పెనిమిటి ప్రమాణికము గానున్ను, వసిష్ఠమునియొక్క భార్యయయిన అరుంధ

తి మునుపు జెప్పినసత్క్రియముచేతనున్ను తెలియచేయబడియున్నది. అదిగ్రోక్కు ఇదిచూడమని చెప్పుటచేత పెనిమిటికి ద్రోహియయిన స్త్రీని నిందించుటకున్ను, పతివ్రతగానున్న దానినిచూచి భావించుటకున్ను చెప్పినట్లున్నది. ఇందులో మంచికారణ మున్నప్పటికిన్ని, ఆయహాల్యనున్ను, అరుంధతినిన్ని అజ్ఞానకథలలో ముఖ్యముగా చెప్పుటయేగాని మరియేమీలేదు. మరియు అజ్ఞానములో అరుంధతి పరలోకములో చేరుటకు వల్లపడినదిగాదు. కాబట్టి అది నక్షత్రమయినది యనుట యబద్ధము. కాబట్టి ఈకృత్యము క్రైస్తవులలో ప్రవర్తించకుండా సంతమయినది. కొన్నిస్థలములలో క్రైస్తవులట్లు జరిగించినయెడల అజ్ఞాన కథలను విడిచి తమభర్తలకు ద్రోహము చేసినందువలన నరకములో బడియున్న పరోథ్యా మొదలయిన అనేకస్త్రీలను గూర్చిన్ని తమభర్తలకు ద్రోహముచేయక ప్రాణమిచ్చుటకు దలంచి పరలోకములో జేరిన సుసానమ్మ మొదలయిన పుణ్యవతులను గూర్చిన్ని అట్లుచేయతగును.

౧౬వది. కొన్నిస్థలములలో బంగారు రేకులతో నయినా బంగారుతాడుతో నయినా చేయబడిన సింగయనే ఒకవిధమయిన యాభరణమును దంపతుల నొసటిలో కట్టుదురు. అజ్ఞానులు అబద్ధపు దైవముయొక్క గురుతుగా దానిని చంద్రవంకవలె చేతురు. క్రై

స్తవులలో నయితే అదికిరీటమువలె చేతురు. ఆనెల
వంకవలె అబద్ధపు దైవమును గూర్చి వాడుకయగుట
చేత క్రైస్తవులకు తగనికార్యము. ఒక కిరీటవిధము
గా నుండునట్లు కట్టినయెడల విఘ్నమేమియు లేదు. రా
జకిరీటమందు వాడుకయిన సిలువగురుతు విశేషముగా
నందుంచినయెడల యుత్తమమే. ఏమంటేని ఆయాభ
రణము దంపతులకు వివాహ సమయములో నున్న
ఒకవిధ రాజత్వమునకు గురుతుగానున్నదందురు. కా
బట్టి ఆయాభరణము ధరించుకొనిన దంపతులు ఎదు
రుకొనినా లేక ఒకరిని యొకరుచూచినా అదికీడుగలు
గజేసే దురదృష్టముగా నుండునని అజ్ఞానశకునముగా
తలంచుదురు. అందువలన అట్టియాభరణము ధరించు
వారు ఎదురుకోకుండా అతిజాగ్రతగా నుందురు. క్రై
స్తవులట్టి యజ్ఞానశకునమును తలంచకుండానున్ను, అ
నుసరించకుండానున్ను ప్రమాణికముగా నుందురు
గాక.

ముందుచెప్పిన కృత్యములే గాక ఇంకా అనేకకృ
త్యములున్నవనుటకు సందేహములేదు. అవి వేర్వేరు
రాజ్యములలో వేర్వేరు వర్ణములో వేర్వేరుగా నుం
డుటచేత వాటినన్నిటిని పరిశోధించి చెప్పినయెడల
యపరిమితశ్రమ కలుగును. కాబట్టి ఈభాగములో తె
లియచేసిన అనేక విశేషములను బట్టి బుద్ధియు విశ్వా

సముగల క్రైస్తవులు ప్రతికృత్యములోనున్న మేలు కీడులను గనుగొని అజ్ఞాన శకునశాస్త్రములన్నిటిని విడిచిపెట్టి అట్టికల్మషమునువిడిచి శుద్ధఆచార కృత్యములను మాత్రమనుసరించుదురుగాక.

వివాహమయిన కొన్నివారములు లేక కొన్ని మాసములు అయినపిమ్మట పుస్తెలతోందు వేరే మరి కొన్ని నగలువేసి గుత్తురు. దీనిని నానకోళ్ళందురు. ఇందులో తప్పులేదనుటకు సందేహములేదు. అయితే వివాహమయినపిమ్మట వాటిని చేర్చికట్టె దినము లేక మాసము శకున శాస్త్రమువలన చూడకూడదు. తనకు ఎప్పుడు ఇష్టమో ఎప్పుడు తీరుబడో, అప్పుడు గుచ్చవచ్చును. కావేరినదిని దేవతయని తలంచే యజ్ఞానులు నానకోళ్ళనె అజ్ఞాన కృత్యములను ఆడియనే ఆషాఢమాసములో ౧౮వ తేదీని చేతురు. అప్పుడుక్రొత్తగావివాహముచేయబడిన స్త్రీలు ఆనదిలో స్నానముచేయుటకు వెళ్ళిదానికి మ్రొక్కి అందుకు పూజచేసి తామున్ను తమభర్తలున్ను పెండ్లిదినములో ధరించిన పుష్పమాలికలను ఆనదిలో బడవేతురు. మ్రొక్కుబడిన్ని అజ్ఞాన పూజయున్ను ఈరెంటిని విడిచిపెట్టి మిగిలినవి క్రైస్తుస్త్రీలు కొందరు అట్లుచేతురట. కొందరయితే తమపువ్వులదండలను నదిలో పారవేయరు. అయినను ఆనదిదేవతయని తలంచుట మిక్కిలి

పిచ్చితనముగా నుండుటచేత అందును గూర్చి యజ్ఞాను లు, నానుకోళ్ళ నిమిత్తము చేయుపెట్టికృత్యములను అ నుసరించకూడదు. కాబట్టి క్రొత్తగా పెండ్లియయిన క్రైస్తవస్త్రీలు ఆదినములో నానకోళ్లుగుచ్చుకూడదు. అందు గూర్చి కావేరినదికి వెళ్ళకూడదు.

## 10వ పర్వము.

### ఒకేభార్యను కట్టుకొనుటలోనున్న మేలు.

ఈదేశమందు అజ్ఞానులలోనున్ను తురకలలోను న్ను అనేకభార్యలను పెండ్లిచేసుకొనె మామూలు వాడుకవుట వలన అందులో కలిగియున్న కీడుకను కొ్కని వారు అందువలన బుద్ధిహీనులయి తామున్ను అట్లుచేయుటకు దురాశకలుగకుండునట్లు కొన్నినీతుల ను చెప్పుటమంచిదియని తలంచుచున్నాము.

సర్వేశ్వరుడు మనుష్యులకు వివాహము విధించిన పుడు పెనిమిటికి ఒకభార్యను మాత్రమే నిర్ణయించిరి. అట్లే చాలాకాలము జరిగినది. మరియు వారు ఆయా యిదేశములలో మొగపిల్లలనుఆడపిల్లలనుఇంచుమించు సరిగా పుట్టించుటవలన తాము ఒకభార్యనెపెండ్లిచేసు కొనుటకు నిర్ణయించినారని ప్రత్యక్షముగాకనపర్చిరి. చాలామార్లు పలుదేశములలో పుట్టినవారి లెక్కసరి గా వ్రాసిచూచినపుడు స్త్రీపురుషుల మొత్తము స

మానముగా నుండును. సర్వేశ్వరుడు ఒకభార్యను నిర్ణయించినపుడు కైీ అనేనరహంతకుని యొక్క శపింపబడినసంతతి వారిలో నొకడు భార్యవుండగా మరియొక స్త్రీనికూడా కట్టుకొనుటకు ఆరంభించెను. అతని దుర్మాత్మకను అనుసరించి మనుష్యులుమోహా పాశములో మునిగి మిక్కిలి చెడ్డవారయి నందువల్ల సర్వేశ్వరుడు పరిశుద్ధముగానున్న ఒకకుటుంబమును తప్ప మరియు మనుష్యులందరిని జలప్రళయమువలన సంహారించెను. వారుకాపాడిన నోవా అనేవారికిన్ని వానిపుత్రు నొక్కొక్కరికి ఒక్కొక్క భార్యమాత్ర ముండెను. అటుపయిని క్రమముగా మనుష్యులు తిరి గితప్పి జారి అనేకభార్యలను పెండ్లిచేసుకునే అలవా టు తిరుగ వాడుకయినది. అపుడు రాజులు ప్రభువులు మొదలయిన ధనవంతులు అపరిమితమయిన స్త్రీబృం దములను ఉంచుకొనుటవలన వారిని విచారించి నడి పించుటకు నపుంసకులను చేయించే చెడువాడుక గలి గెను. అపుడు లోకమందు మనుష్యులు ఇంకా మిక్కి లి పెరుగక పోవుటను బట్టిన్ని మంచివాండ్రు కొంచ ముగా నుండుటనుబట్టిన్ని కొంతకాలము సర్వేశ్వరుడు అనేకభార్యలను పెండ్లియాడె మామూలును సహిం చుకొనుచు వచ్చిరి. అబ్లేయహూదియాదేశ స్తులలో రా తిగుండెతనమునుబట్టి పెనిమిటి తనభార్యనువిడిచిపెట్టి

మరియొక స్త్రీని పెండ్లిచేసుకొనుటకు మోజస్ అనే వారు వారికి శలవిచ్చినారని జేసునాధస్వామి చెప్పిరి. అయితే అవతరించిన దివ్యకుమారుడయిన జేసునాధ స్వామి సత్యవేదవిధమును చక్కగా మనుష్యులకు బోధించి లోకాంతము మట్టుకు తమదివ్యమతములో నడిపించవలసిన సుకృతరీతినిన్ని ఆజ్ఞాపించునప్పుడు అనేక భార్యలను పెండ్లియాడుటయును తనభార్యను వదిలిపెట్టిమార్చుటయును ఖండనగా నిషేధించి పెనిమిటికి ఒకభార్యమాత్రమున్నట్టు బోధించిరి. దివ్యకర్త అన్నిటిలోను మనుష్యులకు మేలుచేయుటకు ఆసించియిందులో వారియొక్క సంతోషమునకు మిక్కిలి తగినవిగానుండుట కట్టడచేసినవారేగాని మరియేమి లేదు. ఒకభార్యను పెండ్లిచేసుకొనుట పెనిమిటి, భార్య, పిల్లలు వీరందరిమేలుకును, కుటుంబ సంతోషమునకును, దేశాధికారమునకును ఆత్మమేలుకును ఉత్తమమే. దీనిని ఇప్పుడు దృష్టాంతముగా చెప్పెదము.

౧టిది. ఇది పెనిమిటి సంతోషమునకు తగినది. ఏలనగిన పెనిమిటి సంతోషము అతని సంసారము, కుటుంబము వీనియొక్క నెమ్మదిలోనున్ను సఖ్యములోనున్ను గలిగియున్నది. వాడు మృగములవలె అపరిమిత భోగము అనుభవించినప్పటికిన్ని అతని సంసారమునకు పొత్తు సఖ్యము లేనియెడల అతనికి సంతో

షమేమి యుండును. అనేకభార్యలను పెళ్లి జేసుకొనే వారిలో ఎంతోమంది తమభార్యలకు గలిగేకలహము లను సఖ్యపర్చుటకు అపరిమిత శ్రమనొందుచున్నారు. ఏకపత్నీకుడయితే దానితో ప్రేమగాను ఏకమనస్సు గాను అతనికి గలుగుచున్న మనస్సంతోషము పలు భార్యలుగలవానికి లేదు. ఇతడు ఒకభార్యను ప్రేమిం చినయెడల తక్కినవారికి ఓర్వలేమితనమున్ను అతనిప యిని కోపమున్ను వచ్చును అట్లు వారిలో నేకమన స్సుగా నుండుటయును నిజమయిన సఖ్యమున్ను, సం తోషమున్ను ఉండదు. మరియు అనేక భార్యలను పెండ్లిజేసుకొనేవాడు కామదురాశలను అనుసరించు టవలన తరుచుగా నతనికి రోగము, బాధ, బలహీన ము, బుద్ధిహీనము మొదలయిన కీడులు సంభవించుట కు కారణమగును. మరియు ఒక్కభార్యను కాపాడు టకు తరుచుగా పెనిమిటికి కష్టముగానుండునపుడు అ నేకులను రక్షించుట ఎంతో కష్టముగానుండును. మ రియు అట్టి స్థితినున్న వారిలో కొందరికి పుత్రసంతాన ము గలిగియున్నప్పటికి తరుచుగా స్వల్పసంతతిగా నుండును. ఇది అనేకులలో దృష్టాంతముగా నున్నది. అనేక భార్యలను వివాహము చేసుకొనిన ఈదేశపురా జులు, ప్రభువులు తరుచుగా తమ తదనంతరము తమ రాజ్యమును పరిపాలించుటకు పుత్రులు లేకపోయిరి.

ఒకేభార్యను పెండ్లి యాడుటవు అలవాటుగలక్రైస్తువుల రాజ్యములో నయితే అనేక రాజవంశములలో అనేకతరములనుండి అనేకవందల సంవత్సరములుండెను. ఇట్లు అర్పశిష్ట ప్రకారశరనే ప్రొంచిరా॥ సంతతివారు ఆరువందల సంవత్సరములనుండి ఉండుటయే గాక ఇంకా అనేకులున్నారు.

2వది. ఒకేభార్యను వివాహము చేసుకొనుటవు అలవాటు భార్యకు మంచిది అని అందరు అభిప్రాయముగా నొప్పుకొందురు. ఏలననిన అది సవతిపోరు లేకుండా పెనిమిటితో నెమ్మదిగా సుఖించి సంతోషించును అనేకభార్యలున్న యెడల అసంతోషము కలుగును. ఒక మనిషికి అనేకభార్యలున్న యెడల వారు సవతులు అని చెప్పబడుచున్నారుగదా? సవతులకు పడదు అని అందరికి తెలిసేయున్నది. అందువలన అపూర్వనింద్యమయిన పేరుగలదిగదా? వారికి అసూయ విరోధము గలిగియుండుటయున్ను అందువలనవారు అపరిమిత దుఃఖము, ఆపద అనుభవించుట ప్రసిద్ధముగానుండుటవలన దానిని గూర్చి విస్తరించి చెప్పుటకు అగత్యము లేదు.

3వది. పిల్లలమేలుకును ఒక భార్యను పెండ్లిచేసుకొనుట మంచిదే. ఏలననిన అనేక భార్యలకు పిల్లలున్న యెడల ఒకతె ఒకతె తనస్వంతపిల్లలకు మేలు

జేయుటకు తలంచునేగాని సవితిపిల్లలను తనబొట్టెలవలె చూడదు. తరుచుగా సవ్రతులు అనూయవల్లనున్ను, విరోధమువల్లనున్ను, తన సవతిపిల్లలను పగపట్టి వారికి పలుకీడులను ప్రాణహాని జేయుటకు నుద్దేశించును గదా? సవితిపిల్లలున్ను ఒకతల్లిబిడ్డలని చెప్పక పోవుచు, ఓర్వలేనితనమునుబట్టి ఒండొరులు పోట్లాడు హెచ్చుకొనుచుండియున్న వారుకారుగదా?

౮వది. అనేకభార్యలను వివాహము చేసుకొనుట కుటుంబమునకు కీడే. ఏలననిన ఒక కుటుంబములో అందరును ఏకమనస్సుగానుండి మేలుగోరుచున్న పక్షము ఆకుటుంబము వృద్ధిపొంది సంతోషముగా నుండవచ్చును. అయితే ఒకనికి అనేకభార్యలున్న పక్షము తనకు తనపిల్లలకు మోసము చేయుటకును వెతుకునేగాని సాధారణముగా మేలుగోరరు. పిల్లలును అట్లేచేతురు. ఇట్లు ఇట్టి వివాహమువలన వేరువేరు అగుటకు కారణమేగాని ఏకీభవించుటకు కారణములేదు.

౯వది. దేశాధికారమునకును సంతోషమునకు అది విరోధముగా నున్నది. ఏలననిన అనేకభార్యలను పెండ్లి జేసుకొనే అలవాటు ఇంద్రియ దురాశలను వృద్ధి జేయుటవలన మంచిమార్గమున్ను, శరీరబలమున్ను, బుద్ధి సూక్ష్మమున్ను, సంతానవృద్ధిన్ని, కుటుంబసమిష్టిన్ని సఖ్యము, సంతోషము చెడుటకు కార

ణమగును. అందుచేత ఆ వాడుకగల దేశము చిరకాలముండదు. క్రీస్తుమతముగల దేశము ఎక్కడయున ఒకభార్యను పెండ్లిచేసుకొనవలయుననే పూర్వాచార అభ్యాసము చేయించినందున అన్ని విధ సంతోషములలో జనవృద్ధిన్ని శాస్త్రశక్తిన్ని శౌర్యమున్ను బలము మొదలయిన సకలమేలులను గలుగజేయును. పదునెనిమిది సంవత్సరముల నుండి ఇవి అన్నిదేశములలో వ్యప్తాంతముగా కనబడుచున్నవి. ఒక భార్యను పెండ్లిజేసుకొనే వాడుకను అనుసరించుచున్న ఐరోపాఖండము మిగిలిన ఖండములకంటె చిన్నదయినప్పటికి తక్కిన ఖండములకంటె అన్నిటిలోను గొప్పతనము, బలము, శక్తిగలదిగానున్నది. పలుభార్యలను కట్టుకొనుచున్న తురకలు మొదలయిన వారయితే మొదట సత్యమతమువలన సంతోషము పొందియున్న కొన్ని దేశములను తమ యుద్ధములలో స్వాధీనపర్చుకొని అందులో తమ రాజ్యభారము స్థాపించిరి. వారి పరిపాలనలో ఆదేశపు ఆస్తిన్ని, బలము, వృద్ధి, సంతోషము నశించి అంధక్రూరత్వము బుద్ధిహీనత మొదలయిన అనేక ఆపదలు పుట్టినవి. ఒకదేశములోను కాలములోను కాదు. పలుదేశములలోను, కాలములలోను అట్లే సంభవించెను. అట్లే మునుపటి కాలములో సత్యమతస్థులు అందులో రాజ్యపరిపాలన చేయుచున్న

పుడు భక్తిగలిగి స్థిరముగానున్న ఈజిప్టు, ఆఫ్రికా, సిరియా మొదలయిన దేశములు పతితులవలన దేవకృప పోగొట్టబడి తురకలయొక్క క్రూరమయిన రాజ్యపరిపాలనకు లోబడిన తరువాత పాడులగుటయే గాకుండా ఇప్పుడు నిర్భాగ్యమున్ను, బుద్ధిహీనమున్ను, దుఃఖమున్ను, లేనటువంటి స్థితిలోనున్నది. ఈ దేశమున్ను ధనము బలముగల దేశము సంపదగల దేశముగా నున్నప్పటికిని ఈ కారణములచేతనున్ను, మరికొన్ని కారణముల చేతనున్ను, బలము స్వాధీనముతగ్గి అజ్ఞానమునకును, ఇంద్రియ సుఖాపేక్షను బుట్టించిన మూర్ఖతనమునకును, ఇంకా అనేక కీడులకునులోబడినదిగదా?

౬వది. అనేక భార్యలను వివాహము చేసుకునే యభ్యాసము ఇంద్రియ సుఖమువలన మంచిరీతిని చెడుపుకొనుటకును కుటుంబములో కలతపడుటకును ఆత్మకుకీడయిన అనేక కారణములను గలుగజేసుకొనుటకును ఆత్మమేలుకు కీడుగానున్న పనుటకునిస్సందేహము. మరియు దివ్యరక్షకుడు ఆచెడువాడుకను పోగొట్టి పెనిమిటికి ఒక భార్యమాత్రమే ఉన్నట్లు ఖండనగా బోధించుటనుబట్టి అందుకు విరోధముగా ప్రవర్తించుట వేదమునకును ఆత్మకును తగనిపాపాక్రమము. కాబట్టి క్రైస్తవులు ఈప్రకరణములో జెప్పినసీతులను బాగా గనుగొని దివ్యకర్త సత్యవేదములో ఒక భార్యను

మాత్రము పెట్టి చేసుకొనే అభ్యాసము ఏర్పడ్చుట సంసారులయొక్క సఖ్యమునకున్ను శాంతమునకు న్ను కుటుంబకార్యములన్నిటికిని సంతోషమునకును మిగిలిన యన్నిటికిని మంచిదియని కనుక్కొని వారిని స్తుతించి ఆసుకృతాభ్యాసము తిరగనిభక్తి ప్రమాణి కముతో ననుసరించుదురుగాక.

## 11వ- పర్వము.

### భక్తిగలకుటుంబముయొక్క సంతోషము.

ఒకసుందరమగుతోటలో పుష్పాలచెట్లు ఫలవృక్ష ములు మొదలగున సకలమున్ను బాగావెయ్యబడి నెమ్మదిగా తిరుగుటకు తగినమార్గముల ఇరుప్రక్కల యందు అనేకవ్యవసాయములున్ను పుష్పాలచెట్లున్ను కూరమళ్లు మొదలగునవి తగినట్లు వేసియున్నపుడు చూపుకు రమ్యముగానుండునుగదా? మరియు అనేక తరహాపుష్పాలచెట్లున్ను దుంపలున్ను నానావిధపుష్ప ములున్ను పుష్పించి పరిమళించుచున్నపుడున్ను ఫల వృక్షములు అనేకజాతిపండ్లు పండినప్పుడున్ను ఎంత సంతోషముగానుండును! ఇంతకంటె భక్తిమార్గము సఖ్యము ప్రేమగలకుటుంబము సర్వేశ్వరునిసన్నిధిలో ప్రియపడి వారికృపవలన మేలు సంతోషము గలు గుటయేగాక మనుష్యులకును ప్రియమైన వారిచేత పొగడపడును.

కి దేవప్రేమ యనేది అన్ని పుణ్యములకును పుట్టి గా నుండుటవలన మొట్టమొదట ఆకులుం బము నందరును సర్వేశ్వరుని ప్రేమించి సేవచేసి ప్ర నూనము జపముచే ఇంకా అన్నిటిలోను వా ప్రకారమే నడుచుకొనుదు. అట్లు సర్వేశ్వరుని మో సేవచేసినట్లు ఇతర్లనుట్టుకున్న తనుకున్న ఇతర ను విధులన్నిటిని ప్రమాణికముగా నెరవేర్చి న అందరికితగిన వారగుదురు. అదియెట్లంటే-

డి- పెనిమిటి తననువలె తనభార్యను సరిగా ప్రే దయప్రేమలతో నడిపించి దానికిన్ని పిల్లల కును అన్న వస్త్రములు మొదలయినవన్ని లోపము లేకు ఇచ్చుటకు ప్రయాసపడును. తనప్రేమవిచా రము నసంసారముపైని వు నుటచేత అక్కడక్కడ వ్యర్థముగా తిరుగకయునువ్యర్థఖర్చుచేయకయును తన గృహ కృత్యములన్నిటిని జాగ్రతగా విమర్శించును. అం లన అతని యింటి కార్యములు అనుకూల మగును.

రెండవది- భార్య తనపెనిమిటిని గౌరవించి ప్రేమించి అత కి ఇష్టపడుటకు ఆలోచించి అతనికి కావలసిన పను సంతోషముగాచేయును. తన పనిపాట్లన్ని టిని బాగా తలంచును. భోజనము ఇతరకార్యములు వీనికి పము లేకుండునట్లున్ను మనోదుఃఖము కలుగ

కుండునట్లున్ను జాగ్రతగానుండును. నిమిత్తముతో కుండాబయటవెళ్లక ఇతరకార్యములలోనున్ను మాటలలోనున్ను తెలియకుండానుండును.

అట్లు ఆసంసారులకు దేవభయభక్తులు ఉండుట వలన వారిపక్షమయి మంచిమాటలు అలవాటగునే గాని పోటీదెబ్బలాటలు గలుగుటకు అవకాశమివ్వరు ఒకరొకరు ఒకరొకరికి కష్టదుఃఖములు గలుగచెయ్యరు. ఒకచెయ్యి నొప్పిపట్టినపుడు రెండవహస్తముతో తోమి పట్టువేసి కుదర్చినట్లు వారిద్దరిలో నొకరికి కష్టదుఃఖములు తటస్థించినపుడు మిగిలినవారు ఓదార్పుమాటలవలననున్ను తగినవిచారణవల్లనున్ను ఆదుఃఖనివారణచేయుటకు తలంచుదురు. ఉభయులున్ను ఏకమనస్సుగా నున్నందున ఒక్కొకరికివచ్చే కష్టసుఖములు ఇద్దరికితుల్యమే. వచ్చేకష్టమును ఇద్దరును భరించి దానిని సహించునపుడు మిక్కిలి సులభము. సంతోషము ఉభయులకు తుల్యముగానున్నపుడు రెట్టింపగును. అట్లే సకలకార్యములలోను ఒకరికొకరు సహాయముగానుండుటవలన వారికి మిక్కిలి మేలు.

అట్లే భక్తిగల సంసారులు తమపిల్లలను ప్రేమించుటవలన వారికి దయతోవిచారించి నడిపించుదురు. చిన్నతనమునుండి సర్వేశ్వరుని ప్రేమించుటకును

ప్రార్థించుటకును వారికిభయపడి నడచుటకును వారికి బోధించుదురు. వారికి అన్న వస్త్రములు చదువు మొదలయినవి ఇచ్చుదురు. చిన్నతనమునుండి వారు దుర్భాషలాడకుండాను దుష్టులతో స్నేహించకుండాను భక్తిగానడచుటకు జాగ్రతగానుందురు. కాబట్టియట్లు మంచిమార్గములో వృద్ధిపొందిన పిల్లలుమంచివారై తలిదండ్రులను గౌరవించి వారిని కష్టపెట్టకుండా ప్రియముగా వారిమాట ప్రకారము నడచుదురు. వారును తలిదండ్రులవలన ప్రేమించబడి భక్తిసంతోషములతోనుందురు. గృహమందున్న మిగిలిన బంధువులును అట్టిసద్గుణములనుచూచి భావించి ముఖ్యముగా వారికి తగిన విధముగా నడుచుచున్నారు. లేదా ప్రత్యేకముగా వెళ్ళవలసియుండును. అట్టిగృహములో ఆవిధముగా భక్తి దేవప్రేమతోను ఇతరప్రేమలతోను అన్యోన్యసఖ్యము పొత్తు అన్యోన్య సహాయము లోబడుట నెమ్మది మొదలయినపుణ్యాము వాడుకయగునేగాని అందుకు విరోధమయిన దుర్గుణమునకు అవకాశముండదు. అక్కడ కలహమున్ను కోపమున్ను మనోదుఃఖమున్ను తిట్టుట దూషణమొదలయినదుర్భాషలున్ను కష్టమున్ను లేదు. ఇట్టిగృహమందుండు వారికి ఎంతోసంతోషము! అందులోనుండుటకు అందరు అంగీకరించుదురుగదా ?

అయితే ఇట్టి మంచిమార్గంబును సుకృత సంతోషంబును దొరకుట ఎక్కడయని యడుగుదురేమో. ఈదేశములో గృహధర్మసుకృతకీర్తిన్ని భక్తిమార్గమున్ను ఇంకా అనేకులకు తెలియకుండా నుండుట వలన గృహధర్మముయొక్క సత్యమైనకీర్తిన్ని సంతోషమున్ను ఈదేశములో అరుదనుటకు నిజమే. అయితే అదికూడను కొన్నియెడల ఎంతయు ప్రేమ సంతోషము కనబడదు. అర్చశిష్టదివ్య కుటుంబము నడుమ మొట్టమొదట దీనికి ఉత్తమమయిన మాత్రుకయినది. అదియెట్లంటే.

గెట్టిది- అర్చశిష్టజోజప్పా అనేవారు ఆదివ్యకుటుంబమునకు సర్వేశ్వరునివలన యజమానిగా నేర్పర్చబడి తమపరిశుద్ధపత్నియయిన దేవతల్లిని అపరిమిత పరిశుద్ధపక్షముతో ప్రేమించిరి. ప్రేమకు భీతినొందక ఆమెకు ఆమె దివ్యకుమారుడయిన జేసునాధునికిన్ని అన్నవస్త్రములకు కావలసినవన్ని సంపాదించుటకు మిక్కిలికోరికతో ప్రయాసపడెను. వారికి యేమి లోపము లేకుండునట్లు యెంతో జాగ్రతతో విచారించును. మనుష్యులవల్లనయినా మృగములవల్లనైనా వారికికీడు రాకుండునట్లు జాగ్రతగా కాపాడెను. దివ్యపితావద్ద వారికినడపించుటకు శలవుపొంది యున్నప్పటికిన్ని అధికారముచూపించక అతిస్నేహముగా వారికిపనిపాట్లుచెప్పి వారితోమాట్లాడి వారినినడపించెను.

2వది- అర్చ్బిష్టకన్య మరియమ్మదైవమాత అయి నందున పరలోక భూలోకములకు రాణిగా నిర్ణ యించబడి అర్చ్బిష్టజోజప్ వారికంటే గొప్పదిగా నున్నప్పటికిన్ని వారు సర్వేశ్వరునివలన తమకు దయ చేయబడిన పరిశుద్ధభర్తయనిన్ని యజమానియనిన్ని వారిని వినయముతో గౌరవించి వారుచెప్పినట్లువిని వారిక ఉపచారము చేయుటకు సంతోషముతో నుండెను. సర్వేశ్వరునకుచేసే సేవవలె తను యింటి పనులన్నిటిని జాగ్రతగాచేసెను. అందులో సకలము రీతిగానున్నట్లు విచారించుచు తన పరిశుద్ధపతికిన్ని దివ్యకుమారునకున్ను అన్నవస్త్రములుతగినట్లు అమ ర్చెను. మిగిలిన యన్ని కార్యములలోను తన శక్తికొ లది వారికి సహాయముగా నుండుటకు వెతుకును.

3వది- జేసునాథస్వామి అర్చ్బిష్టజోజఫ్ వారికిని దివ్యమాతకును లోబడియున్నారని సువిశేషములో జెప్పియున్నది. వారు కర్తఅయినను సర్వమునకు రాజాధిరాజయినను ఇతర పిల్లలకంటె తలితండ్రులను ప్రేమించి మిక్కిలి వినయముతో ఒకస్వల్ప ఆటంక మున్ను ఆలస్యమున్ను లేకుండాలోబడెను. అర్చ్బిష్ట జోజప్పువారికిబడ్డపనిలో సహాయముచేసితామున్ను తమదివ్యహస్తముతో ఆపనులనుచేసెను. గృహాకృ త్యములలోను తమ దివ్యమాతకు తోడుగానుండిరి.

ఇట్లు సకలకార్యములలోను వారిమాటప్రకారము నడిచిరి.

ఆదివ్యకుటుంబములో ఎట్టి యన్యోన్య ప్రేమ ! ఎట్టిసఖ్యము ! ఎట్టినెమ్మది ! భక్తిసంతోషములెట్టివి సర్వేశ్వరుని స్తుతించుటకును అన్నిటిలో వారికి ప్రియముగా నడుచుటకు ఎట్టిసిద్ధము ! ఈ భక్తిరీతివలన తక్కిన యన్ని కార్యములలోను [illegible] ప్రవర్తనాదికము ! జాగ్రతయును సిద్ధమున్ను ! మరియు అన్నిటి లోను దివ్యచిత్తము నెరవేర్చుటవలన మోక్షయానం దము వారికి గలుగును ! దారిద్ర్యము మొదలయిన ఇబ్బంది యున్నప్పటికిన్ని [illegible] వారికి సహాయముగా నుండుటవలన ఆది[illegible]రించుదురు.

ఈదివ్యకుటుంబము చూపించిన మాత్రుకప్రకా రముగా సత్యమతరాజ్యములో లెక్కలేని కుటుంబ ములు ముందు చెప్పిన సుకృతరీతిని అనుసరించుటవలన అపరమితమేలున్ను, సంతోషమున్ను పొందియుం డుట నిశ్చయము. ఇది ఆరాజ్యములో అందరికి దృష్టాంతముగా తెలిసినవిషయమే. ఈదేశములోనున్న సంసారులు అట్టి సుకృతరీతిని అనుసరించినయెడల అందుకు తగిన సుఖసంతోషభాగ్యముల నొందుదు రనుటకు నిస్సందేహము.

---

# 12వ- పర్వము.

## బాలకులబోధ.

అడవి మొదలయిన నాఖిరుదుభూమికిని, బాగ పైరుచేయబడిన పొలమునకును చాలా వ్యత్యాసమ గలదు. అడవియందును నాఖిరుదు భూమియందున తరుచుగా పుట్టుచున్నయి పనికిరాని ముళ్లు మొదలగు నవిగదా ? [illegible] కొన్ని చెట్లుపుట్టి [illegible] తరుచుగా కాసెడి చెట్లు. కాచే చెట్లయినప్పటికిని లేక అడవిపళ్లుగానుండును. బాగా పైరుచేయ బడిన పొలమయితే మిక్కిలి ప్రయోజనమయి ధాన్య ము, కూరలు, రుచిగలపండ్లు కాయలు ఫలించె చెట్ల మొక్కలుపుట్టునుగదా ? అట్లు మనుష్యాత్మలో వ్యత్యాసముండును. చిన్నతనమునుండి వారికి విద్యా విచక్షణ లేనియెడల కొనుర భూమితోను, అడవితోన తుల్యముగానుండును. అందు పాప దుర్గుణములున సకలకీడులును పుట్టును అయితే చిన్నతనమునుం వారికి సరిగా బోధించి సుకృతరీతిప్రకారమునడపి చినయెడల వారియొద్దసద్గుణములున్ను, సకల సుకృ మేలులున్ను గలుగును. అది ప్రతిదినము దృష్టాంత మువలన తెలియును. విద్యాహీనులు సిగ్గులేకుండ ననేకపర్యాయములు దుర్భాషలాడుదురు. అనే దుష్కృతములున్ను చేతురు. బాగా చదువుకున్న వ

రయితే తరుచుగా మంచిమాటలనుమాత్రమాడి సుకృతరీతిగాను, యోగ్యతగాను ప్రవర్తించుదురు గదా? అంతేగాక మొదటమంచిధాన్య మంచిఫలములు పండినభూమి చిరకాలము సాగుబడి చెయ్యకుండా విడిచిపెట్టినయెడల తరువాత కొర్నుబడి పనికిరాని గాబు, ముళ్లుగల యడవియగును. అట్లేయుండు బాగాబోధింపబడి కొద్దికాలము బాగానడచిన బాలురు మొదలయినవారు తరువాత విచారణలేకుండా విడిచిపెట్టినయెడల అనేకులు పాపదుర్గుణములవలన చెడుదురనుటకు నిస్సందేహము. అయితే మంచివిచారణవలన తిరుగా బాగుపడవచ్చును. అయితే నాఖరుదుభూమియును, అడవియును అట్లే విడువబడి ప్రతిదినము మంచిపంట పండినట్లే సుకృతబోధనలేక విడువబడిన మనుష్యులు సాధారణముగా సుకృతపంటను ఫలింపచేయుదురనుట నిశ్చయము. ఏలనంటే అది తలిదండ్రులు పిశాచదుర్బోధనవిని సర్వేశ్వరునియొక్క కట్టడనుమీరిన పాపదోషమువలన మనుష్యసంతతియొక్క స్వభావముచెడిపోయినది. పిశాచమునకు బానిసిగా పుట్టుచున్న మనుష్యులకు సకలపాప దుర్గుణములయొక్క అంకురముండుటవలన చిన్నతనమునుండి వాటిని అణచి నిర్మూలముచేయనియెడల అవి మొలచి వారిని సకలకీడులలో పడవేయును. అందు

వలన చిన్నతనమునుండి బోధింపబడనివారు క్రమ క్రమముగా దుర్మార్గుణాలను చేయుకీదువలన దుర్మార్గులగుదురు. ఇవన్నియు ఇట్లుండగా పిల్లలను బాగా బోధించుట మిక్కిలియగత్యము. తల్లులు మొదలయిన పెద్దవారు లేతరికములో పిల్లలకు మంత్ర జ్ఞానోపదేశము మొదలయినవన్నియు నేర్పించి సుకృతరీతిని వారికి నేర్పవలసిన విధమును మొదట నాలవపర్వము రెండవప్రకరణములో చెప్పుటనుబట్టి ఇచ్చట తిరుగా వ్రాయుట కగత్యము లేదు.

వారట్లు గృహమందు బోధ నేర్చుకున్న పిమ్మట బడికి పంపుటన్యాయము. పలననిన వారియొక్క యాత్మ రక్షణ్యమునుగూర్చి బోధన నేర్పుటయును వారిటు పయిని ప్రవర్తించుటకు శక్తిగలుగ జేయుటయును బడిలో చదివించుటయును అగత్యమే. తలిదండ్రులు పిల్లలకు సంపాదించి యివ్వతగిన ఆస్తులలో ప్రధానమయినది. మంచి బోధనలనే ప్రస్తావము నిశ్చయమయినది ఏమంటేని భాగ్యము దుర్గుణముగలపిల్లలకు తరుచుగా కీడుగానుండును. మంచిబోధన యయితే సర్వదా కార్యకారియగును కాబట్టి తలిదండ్రులుతమ పిల్లలకుతమ శక్తికితగినట్లుమంచిబోధనచేతురు. ఇదివరకు చెప్పిననీతులు బాలికాబాలకులకు కార్యకారియగును. అటుపయినివీరుభయులకు వెవ్వేరుగా తెలియచేతుము.

## 13వ పర్వము.

### బాలికా బోధన.

బాలికలకు విద్య నేర్పించుట ముఖ్యము. సాధారణముగా పిల్లలకు చదువు చెప్పించవలయునని వెనుక చెప్పిన నీతులన్ని, వారిమట్టుకు సరిగా నుండుటయేగాక బాలికల బోధన బాలకుల బోధనకంటే అత్యావశ్యక మనుటకు గొప్ప కారణముగలదు. వారికి మేలయిన విద్యలు విశేషఅగత్యము లేకపోయినప్పటికిన్ని మంచిమార్గమునకు తగిన సుకృత బోధయును, సత్య బోధనయును, బుద్ధిజ్ఞానములున్ను తెలియచేయుచున్న మరికొన్ని విద్యలున్ను వారికి అగత్యమే. ఏలనంటే తల్లులు తమ పిల్లలకు స్తన్యముతో జ్ఞానమనే పాలు పెట్టవలసినది. వారే బాల్యమునుండి వారిని మంచి మార్గములో నడపించవలయును. వారే బాలురకు మొట్టమొదట జ్ఞానవిద్య చెప్పించ వలయును. వారికే విద్య లేనియెడల తమపిల్లలకు ఎట్టిబుద్ధి చెప్పుదురు? మరియేవిద్య చెప్పుదురు? వారిని ఎట్లు సుకృతరీతిగా నడపించుదురు.

ఇంటి యజమానురాలు తమ యింటి స్త్రీలకు గలిగె కీడులకు కలహము, తర్కము వ్యాజ్యము విని తీర్చవలయును. అందుకు ప్రతివారికి తగిన బుద్ధిచెప్పి వ్యత్యస్తముగా మాట్లాడినవారిని తగినవిధముగా శా

యిదాచేసి సఖ్యపర్చవలయును. మరియు గృహామం దున్న స్త్రీలను, పిల్లలను, చిన్నలను గృహాకృత్యము లను పద్ధతిగా నడపించవలయును. వీటియన్నిటికిని మేలు అయినబుద్ధి, వివేకమున్ను, జ్ఞానమున్ను, శక్తిన్ని, కావలయునుగదా? ఇవి విద్యలేకుండా నెట్లులభించు ను. ఇంటియజమానురాలు బుద్ధిచెప్పుటయును, వివు ర్శగా తనచిన్నలను నడపించుటకు తెలియనియెడల దాని ఇంట్లోచాలాకార్యములు గందరగోళమగును. దెబ్బలాటలు మొదలయిన కీడు లనేకములుగలుగును.

కొన్ని సంవత్సరములకు ముందు ఈ దేశములో బాలికలకు ఏబోధ విద్యలున్ను లేవు. త్రవాత, చదు వు, వారికి లేకపోయెను. (కంణ్ డయ రెన్ బవర్ కట్టో ము గత్తిరండు పుణ్డై యర్ కల్లాదవర్) దీనితాత్పర్య మేమంటే విద్యగలవారు రెండునేత్రములుగలవారు. అదిలేనియెడల పుళ్ళుగాని కళ్ళుగావు. అనేనీతి ఈ దే శములో ప్రస్తావముగా వాడుకయినప్పటికిని స్త్రీలను జ్ఞాననేత్రములేని మూఢులుగా విడిచిరి. అందువలన వృద్ధియయినకీడులకు లెక్కలేదు.

స్త్రీలయొక్క విద్యవలన గలిగిన మేలులు విశే షముగా నిపుడు పుదుచ్చేరిలో గలిగియుండుటనుబట్టి బాగా దృష్టాంతమయినది. అదియెట్లంటే స్త్రీలకు వి ద్యలేని కాలములో అనేక పిల్లలకు పది, పండ్రెండు

పదునాలుగు సంవత్సరములవరకు మంత్రజ్ఞానోపదేశము తెలియకుండిరి. కాబట్టి తమను సృజించిన పరమకర్తను తెలుసుకొనకయును స్తుతించకయును ఉందురు. ముందు సత్ప్రసాదములో నైకొన్న సమయములో ప్రధాన మంత్రములున్ను జ్ఞానోపదేశములో సగముగా నేర్చుకొనుట అనేకులకు అరుదుగానుండెను. మరియు అనేకులు వాటిని శీఘ్రములో మర్చువారు మరియితర విద్యావంతులు మొగవాండ్రలోను విద్యలేకపోయెను. అపుడు స్త్రీలు వర్ణాచారములేని పలుదుర్భాషలాడిరి. అనేకులు భక్తిలేకుండానుండిరి. మరియనేక లోపములు అపుడు ప్రారంభమయినవి.

స్త్రీలకు విద్యవాడుకయిన దినమునుండి దాని మేలు వెల్లడిఐనది. చిన్నతనమునుండి పిల్లలు మతమును ఉపదేశమును నేర్చుకొని సర్వేశ్వరుని వేడుటకును, భక్తిరీతియనుసరించుటకును అలవాటుగలవారగుచున్నారు. ప్రథమ సత్ప్రసాదము గయికొన్న సమయములో మంత్రోపదేశములు బాగా నేర్చుకొనుటవలన మొగవాండ్రుగూడా రోషపడి బాగా నేర్చుకొనిరి. పాఠశాలలో పురుషులు విద్యకూడా రోషమువలన వృద్ధియయినది. మంచి విద్యవలన భక్తిరీతిన్ని, సుకృతమార్గమున్ను, మర్యాదయున్ను, మంచిమాటలున్ను, యోగ్యప్రవర్తనయున్ను గలుగుటయేగాక

దుర్భావములున్ను, దుర్నడతలున్ను చాలా తక్కువ యినవి.

స్వల్పకాలములో స్త్రీలవిద్యలవలన ఇన్ని మేలులు గలిగియుండగా క్రమక్రమముగా అందువలన గలిగే మేలులు ఇన్నియని చెప్ప శక్యముకాదు. లెస్సగా విద్యాభ్యాసముచేయింపంబడిన బాలికలు పెద్దవాండ్రై వివాహమయిన పిమ్మట బోట్టెలతల్లులయిన తరువాత తమపిల్లలకును సరిగా నేర్పించి వారిని గృహములోనున్న చిన్నలు తమయింటి కార్యములున్ను బుద్ధిజ్ఞానములతో రీతిగా నడపించి తమ కుటుంబము సంతోషముగా జీవించుటకు దేవకృపవలన కారణులగుదురు. అట్లే కలకాలము నుంచి బోధతోను, సుకృతసంతోషముతోను ధనము కుటుంబములో వర్ధిల్లును. గృహమందుబాలికల విద్య ఇహమందే అపరిమిత మయిన మేలులను గలుగజేయుటయేగాక అనేక ఆత్మలు మోక్ష రాజ్యములో జేరుటకు త్రోవయగును.

అయితే బాలికయొక్క బోధనయంతయగత్యమయినప్పటికిని వారిని బాలకుల పాఠశాలలకు పంపించకూడదు. పురుషులవలన వారికివిద్య చెప్పించుటయునుగూడదు. ఏమంటేని అది పలుకీడులు సంభవించుటకు కారణమని అనేక దృష్టాంతములవలన నిశ్చయిం

చబడినది. నిర్మలము, సుకృతసంకోచము ప్రతిష్ఠకొఱ తలేకుండా వారిని కాపాడుటయావశ్యకము. వారింకా బాలికలని మేలులో వర్థిల్లుచున్నారని పెద్దలు నమ్మి వారిని మొగవాండ్రతో నయినా, నారివల్లనయినా ఎంతమాత్రము చదువుచెప్పించవద్దు. ఏలననిన అందు వలన ఎట్లయినా పాతివ్రత్యమునకును, కీర్తికిని, ఆత్మ రక్షణ్యమునకును భంగమువచ్చును బాలికలకు గొప్ప పాఠశాలలేని స్థలములలో చదువుకున్న స్త్రీలవలన వారికి చేతనయిన మట్టుకు చదువుచెప్పించవలయును.

---

## 14వ పర్వము.

### మద్యపానమువలన గలిగే కీడు.

మద్యపానమువలన ఈదేశమందు చాలా జనులు న్ను, కుటుంబములున్ను దరిద్రములై చెడుచున్నవి. అందువలన ఇహపరములయందు గలిగెడు కీడులకు హద్దులేదు. కాబట్టి వాటిని తెలియచేసి ఆ దుర్గుణము లనుగూర్చి బుద్ధి చెప్పుట యగత్యము.

ఁగటిది. అందువలనగలిగే బుద్ధిమాంద్యము మి క్కిలి నీచమయినది. అదిఎట్లనిన సర్వేశ్వరుడు మను ష్యులకు దయచేసిన బుద్ధియు, జ్ఞానము, మద్య పాన ముచే పోవుటవలన మనిషి మృగమువలె అగుచున్నా డు. మరియు మృగములకంటే తక్కువస్థితికి పాత్రుడ

గుచున్నాడు. ఏలననిన మృగమునకు ఒక విధమయిన తెలివియుండవచ్చును. మత్తతగల మనిషికి ఆ తెలివిన్ని, బుద్ధియునశించును. తాను సంభాషించుటయును, చేయవలసినవి చేయుటయును, తానున్న స్థలమున్ను తెలియదు. యుక్తాయుక్తము తెలియక నోటికివచ్చినట్లు పేలుతూతిట్టును. మరియింకా అనేకకీడులు జేయును. ఆసమయములో దుష్టమృగములకంటే దుష్టమృగములుగనుందురు. వారిమత్తతతీరిన పిమ్మట ఆసమయములో తాము చెప్పినదిన్ని, జరిగించినదిన్ని, ఇతరులవలన కనుక్కొనేటప్పుడు భ్రమించుచున్నారు. తెలియక జేసితిమియని అందురు. ఐనను జరిగించినదిన్ని, చెప్పినదిన్ని అక్రమమే.

౨వది. మద్యపానమువలన ఆత్మచెడును. ఏలననిన ఇపుడు చెప్పినట్లు తాగుబోతు సర్వేశ్వరుడు తనకు దయచేసిన బుద్ధిజ్ఞానములు మద్యపాన మత్తతచేత చెడుపుకొనుటవలన చావయిన పాపమునకు లోబడుచున్నారు. వాడు ఆమత్తతవలన మరియేకీడులుజేయకఉూరకే నెమ్మదిగా నిద్రించినను మత్తతగానుండుటయే వానికి ఘనమయిన పాపము మరియు తాగుబోతు మత్తతగానున్నపుడు చేయుకీడులు తెలియక చేసినప్పటికిన్ని బుద్ధిపూర్వకముగా త్రాగుటవలన వానికి పాపము. కాబట్టి తాగుబోతు పాపము భరించవలసి

యుండును. వాడు త్రాగేఅభ్యాసము విడవనంతమ ట్టుకు చావయిన పాపస్థితిలోనుండును. వాడు ఆ చెడ్డ స్థితిలో మరణము నొందిన యెడల చిరకాలము నరక శిక్షకులోబడును. అతడు స్వామినిబంధననుమీరి త్రాగి పాపమునకు శిక్షగా సదా నిప్పులోనుండుచు ఒక నీళ్ళబిందువయినా లేకుండా దప్పికబాధచేత ఇతరశిక్షల నొందును. అట్లుండగా బుద్ధివిశ్వాసము గలవాడు మద్యపానముచేయవచ్చునా? దానివలన శిక్షగలదని యెరిగిన్ని త్రాగువాడు బుద్ధిహీనుడుగదా?

3వది. త్రాగుటవలన గౌరవనష్టమగును. తాగుబోతులను, నిషాచేయువారిని అందరు నిందింతురు. వాడు త్రాగి నడవశక్తిలేక జోగుచు పడుచు మతిబోయి గొణుగుచునుండుటయును, దుర్భాషలాడుటయును, దుష్కార్యములు జేయుటయును చూచేవారున్ను, వినేవారున్ను వానిని ఎట్లు గౌరవించుదురు? కాబట్టి తాగుబోతులు ప్రతిదేశములోను నిందనొందుచున్నారు. ఈదేశములో మిక్కిలి నీచముగా చూడబడుచున్నారు స్వల్పకులస్థులున్ను తాగుబోతు అనిపించుకొనుటకు సిగ్గునొందుచున్నారు. అట్లుండ ఎవడయినా తాగవచ్చునా? గొప్పకులస్థులుకూడా నిషాచేయుటకు సిద్ధపడుటఎట్లు? స్వల్పవర్ణస్థులు మాత్రము నిషావస్థువులను పుచ్చుకొనుచున్నారని అనేకు

లు తలంచుచున్నారు. ఐతే గొప్పపట్టణములలో సా రా అమ్మకమువలన సర్కారురాబడిచూడగా అన్ని వర్ణములవారు త్రాగుచునట్లు దృష్టాంతముగాకనబడ్డది. కొందరు త్రాగివచ్చేటప్పుడు వేలిమునుకు వేసుకొని యయినా, లేక తమ యింట్లో రహస్యముగా నయి నా నిషావస్తువులను పుచ్చుకొనుటవలన పయివారికి తెలియదని తలంచుచున్నారు. అయితే తరుచుగా తా గినపుడు పొరపాటుమాటలు, గృహమందుచేయు అ ల్లరనుబట్టి తాగుబోతులని వెల్లడగుచున్నది. గొప్పకు లస్థులు పొరపాటుగా మాట్లాడుటవలన మద్యపానదో షము వెల్లడై గౌరవము చెడుచున్నది. తాగియింట్లో చేసిన అల్లర బూతుమాటలు మొదలయినవన్నియు ఇంటివారు భరించలేక అందరితో చెప్పుదురు. అందు వలన ఎంతోమంది అపకీర్తిపాలయిరి. మనుష్యులకు ఆతప్పు తెలియకపోయినను సర్వేశ్వరునకు తెలియదా? వారందుకు శిక్షించరా?

౨౫వది. తాగుబోతువాని యింట్లో ఏమియుండదు వానిసంపాదనంతయు త్రాగుటకు వ్రయుపర్చి భార్య కు, పిల్లలకు అన్నవస్త్రములులేకుండా చేయును. ఒ కపుడు తన సంపాదన చాలక భార్య, పిల్లలు సంపా దించినదికూడా అపహరించును. వాడుతాగి ఇంటికి వచ్చునపుడు యింటివారందరికిఉపద్రవమే. వానియల్ల

ర. ఎవరు సహించుదురు? తనకు ఎవరయినా ఎదిరించి మాట్లాడినయెడల ఇంట్లోవున్న వస్తువులన్ని పాడుచేయును. వాడాదమరచి నిద్రించువరకు ఎవరు నిద్రించుటకూడదు. ఇట్లు తాగుబోతువాని కొంప ప్రత్యక్షన రకమువలె నుండును.

౧౪వది. తాగుటవలన గలిగెడుకీడులన్నియు భయంకరములయినవే. తాగుటవలన అనాయాస మరణము సంభవించును. అందుకు దృష్టాంతము చూచితిమి. రెండుపర్యాయములు తాగుబోతులు జట్టుగాపోలీసు సావిడికి వెనుకతాగుటకు వెళ్ళి తిరిగివచ్చేటపుడు ఆజట్టులో ఒకడు చటుక్కునపడి చనిపోయెను. ఒకపిల్ల ఇంట్లో సారాబుడ్డి ఉంచుటవలన విస్తారము తాగినందువలన ఆదినమే చనిపోయెను. అనేకులుతాగి నిషాతీరక మరికొంత సేపటికి చనిపోయిరి. చాలామంది త్రాగి ఒళ్ళు తెలియక నుయ్యి, యేరు, చెరువునీటిలోపడి చచ్చిరి. చాలామంది విశేషముతాగి జబ్బుపడి మృతినొందిరి. ఇవిఇట్లుండగా త్రాగుట ఎట్టినిర్భాగ్యము! కాబట్టి ఎవడున్ను ఈపాప దుష్కార్యమును అభ్యసింపక జాగ్రతగా నుండవలయును.

నిషాచేయనవికొన్ని మందులవలె శరీరసౌఖ్యమునకు పుచ్చుకోవచ్చుననుటకు నిస్సందేహము. సాధారణముగావాటినితగినట్లు పుచ్చుకొన్నపుడుకీడుగలుగజే

యుకుండా శరీరసౌఖ్యమునకు ప్రయోజనము కావచ్చు
ను తగిన మందులను పుచ్చుకుంటే సౌఖ్యము గలుగు
నట్లు మొదటచెప్పిన పానములను కొంచెముపుచ్చుకు
న్నయెడల కొందరికి సౌఖ్యముగలుగుననిన్ని అట్లు చే
యుట తప్పులేదనిన్ని అంగీకరించవచ్చును. అయితే
ఈదేశములో తాగుటకు మితిలేదు. పానారంభమందు
కొద్దిగా త్రాగుదురు. క్రమక్రమముగా సుతిమించి చె
డిపోదురు. స్వల్పమయిన మత్తతవలన అందుకు తగి
నతప్పు గలుగును. ఐనను అందుకు తాగేవానికి మో
సముగలదు. ఏలననిన ఆయలవాటు అయిన పిమ్మట
క్రమక్రమముగావృద్ధియై మ్రానివేసినపిమ్మట కీడుకు
న్ను, శ్రమకున్ను కారణమగును బాగా త్రాగుట
కొందరికి సౌఖ్యము అయినప్పటికిన్ని విశేషించి త్రా
గుట శరీరసౌఖ్యమునకు విరోధము. అందువలన అనే
క రోగములు గలుగుచున్నవి. తుదకు అన్నము జీర్ణ
ముకానందున శరీరఅపాయము గలుగును. గనుక
ముందుచెప్పిన కీడులన్నియు త్రాగుటవలన గలుగుచు
న్నవి గనుక ఆ యభ్యాసము విడవవలయును. కాబట్టి
ఎప్పుడున్ను త్రాగుబోతులతో జేరక చేతనయినమట్టుకు
జాగ్రతగా నుండవలయును. పెద్దలు చిన్నవాండ్రు
అట్టి కానికార్యములు చెయ్యకుండునట్లు జాగ్రతచేతు
రుగాక. తాగుబోతులు తమకు గలుగుచున్న కీడులను

గనుగొని అట్టియలవాటుమాని మనస్సు కుదురుపఱ్చి జాగ్రతగా నుండురుగాక.

## 15వ- పర్వము.

### మరణప్రయత్నము.

ఒకతోటమాలి జాగ్రతతోను, ప్రయాసముతోను తనతోటను సంరక్షించుచున్నప్పటికిని పుష్పముల చెట్లును, వృక్షములను, వేరేపయిర్లనున్ను సంరక్షించుటకు విశేషముగా పనిచేసినప్పటికిని తరుచుగా ఎండలవలన పుష్పములు వాడిపోవును. కసుగాయలును రాలిపోవును. పిందెలును రాలిపోవును. పండ్లు మొదలయినవి రాలిపోయేకాలముకలదు. అట్లు పండిన ధాన్యమునకు కోతకాలమువచ్చును, వృక్షములు మొదలయినవి కొంతకాలమయినపిమ్మట యెండిపోవును. గృహాధర్మోద్యానమయినా ప్రతికుటుంబములో అట్లు సంభవించుటకలదు. కొందరిని పరమకర్త బాలప్రాయములో కొందరిని వయఃకాలములోను, కొందరిని కౌమారములోను, కొందరిని వృద్ధాప్యములోను ఇతరలోకమునకురప్పించుకొనుచున్నారు. ఈలోకమందు ఏమియును నిలవదు. అందరికిని నాశముగలదు. అట్లు తాను ఒకదినమున మృతినొందునని బాగా తలంచవలయును. మరణము అన్నిప్రాయములలోను వచ్చు

ను. అయితే అందరికిని ఒకవిధముగా రాదు. కొందరు చటుక్కున వృక్షమునుండి కాయరాలినట్లు శీఘ్రము గా మృతినొందుదురు. కొందరయితే ఎండిపోచున్న వృక్షమునలె రోగమువలన చనిపోదురు. తాము లో కాంతరగతులగుట ఎపుడో, ఎచ్చటనో, ఎట్లో, ఎంత మాత్రము తెలియదు. కాబట్టి అందుకు సుప్రయత్న ముగానుండవలయును. అందులో నిశ్చయముగా తెలి యచేయుసత్యము లేవంటే చనిపోవుట ఒకపర్యాయ మేగాని అనేకమార్లుగాదు, మరియు మంచిమరణము నొందినయెడల నిత్యసంతోషము గలుగును. చెడుమ రణము గలిగినయెడల శాశ్వతమగు నరకశిక్షతప్పదు.

అట్లుండగా మంచిమరణమునకు బ్రయత్నించుట ఎంతో అగత్యము ! ఏలనంటే మరణమునకు ఎపుడును మంచిప్రయత్నము చేయుచున్నయెడల ఆనందమరణ ము నొందుటకును, ఎప్పటికిని మోక్షరాజ్యములో జీవించుటకును సర్వనమ్మకముగలదు. అయితే మరణ మునకు ప్రయత్నముగా నుండునపుడు చటుక్కున మరణము తటస్థించినయెడల అది నిత్యదుఃఖబాధకు కారణమగును.

మంచిగుణమునకు సదా సిద్ధముగనుండుటకు మొ దట పాపమంతయు తొలగించి పుణ్యరీతిగానుండవల యును. ఏలనంటే సర్వేశ్వరుని స్నేహించి సేవచేసి భ

_క్తిగా నడుచువారికి మరణము యెప్పుడు వచ్చినప్ప టికిని వారికి మేలు సంతోషము దొరకును.

౨వది- సకలమేళ్ళకును మేలయినవరములకు మంచి మరణవరము తనకు గలుగునట్లు సర్వేశ్వరునివద్ద మాటిమాటికి ప్రార్థించుకోవలయును. ఏలనంటే పుణ్యములో స్థిరముగానుండుటకును, మంచిమరణము నొందుటకును విశేష దేవానుగ్రహము కావలయును. భక్తిప్రేమతో అడిగేవారికి స్వామి దయచేతురు. ఆవరమున్ను, అందుకు కావలసిన దేవానుగ్రహమున్ను, నిశ్చయముగా దొరకునట్లు మరణసమయము నందును మంచి మరణవరమునొందుటకు విశేషముగాఆధారసహాయములుగా అర్చ్చశిష్టకన్య మరియాయినిన్ని, అర్చ్చశిష్ట జోజప్పు మొదలయిన అర్చ్చశిష్టుల వార్లనున్ను మాటిమాటికి ప్రార్థించుటమంచిది.

౩వది- మంచిమరణమునకు అగత్యమయినయాత్మశుద్ధినొందుటకును, కాపాడుటకును, మాటిమాటికి మంచిపాపసంకీర్తనము, దివ్యసత్ప్రసాదము గైకొనుటకు తగును. ఏలననిన ఈదివ్యఅప్పము నిత్యజీవనసంతకరువుగానున్నది. దానిని భుజించువాడు నిత్యముగా జీవించునని జేసునాథస్వామి సెలవిచ్చిరి.

౪వది- ఏవయస్సులోనయినా రోగమువచ్చినపుడు

అది మురియకముందే మంచి పాపసంకీర్తనముచేసిన యెడల మంచిది. ఏలనంటే- తరుచుగారోగము స్వల్ప కార్యముగా కనబడి కొద్దిలోబాగౌను అని అందరు నమ్మియున్నపుడు అది చటుక్కున మురియగానే బుద్ధి మందగించి ఆత్మ కార్యములను తలంచుటకు శక్తిలేక పోతుంది. అట్టి రోగము స్వల్పమనిన్ని కుదురునుఅని న్ని అనేకులునమ్మి మోసబడిరి. కాబట్టి యట్టిసమయ ములో యాత్మరక్షణ్యము ప్రధానముగాతలంచి అం దుకు చెయ్యవలసినవన్నియు జాగుచెయ్యకూడదు. అందుచేత రోగము కుదురుటకును, సౌఖ్యమునొందు టకును, కావలసిన వయిద్యముచేయుటకును విఘ్న ములేదు. మంచి పాపసంకీర్తనము అందుకు కార్య కారి అగును. ఏలనంటే ఆత్మనుశుద్ధిచేసి సర్వేశ్వరున కు తగినవాడు అగుట వారిదయయును సౌఖ్యము నొందుటకు మార్గము.

౫వది- ఆసమయములో పాపసంకీర్తనముచేయు టకు ముందు యెవరితోనయినా పగ, అసహ్యము, మనస్తాపము వున్నయెడల సమాధానపరుచుకోవల యును. పయివారివద్ద తాను తీర్చవలసిన అప్పుమొ దలయినవి యున్నయెడల అగత్యముగా తీరుమానము చేయవలయును. ఏలనంటే యితరులసొమ్ము తీర్చనియెడ ల ఇతరులసొమ్ము అపహరించినట్లయిన నరకములోబడు

టకు కారణమగును. ఇంకా తీరని యప్రతిష్ట మొద లయిన మానసష్టమున్న యెడల దానిని తీర్చుటకువిధి.

౬వది- తనయాత్మ కార్యములను విచారణచేసి తగినట్లు దిట్టపర్చినట్లే తనధనము మొదలయిన కుటుం బకార్యములను తగినట్లు దిట్టపరిచినయెడల మంచిదే. ఏమంటేని అనేకులు తండ్రియాస్తిని సోదరులుపంచు కొనకుండానుందురు. అందువలన వారియనంతరము వారిసహోదరులకును, పుత్రులకును మిక్కిలి తొంద ర, కలహము, పోటి, దెబ్బలాట, పంచాయితీవ్యాజ్య ము సంభవించుటకు కారణమగును. పెద్దకుటుంబము లో కొందరు పెండ్లిచేసి సంతానవంతులయి తాము ను పిల్లలను బాగాసంపాదించుదురు. కొందరు స్వల్ప సంపాదనచేతురు. కొందరు సంపాదించక వ్రయపర్చు దురు. అట్టి కుటుంబములో పంచుకొనక యశ్రద్ధగా నున్న యెడల పెద్దలు కాలముచేసిన తరువాత కలహ ములు, అన్యాయములు, వ్యాజ్యములు జరుగునుకా భట్టి పెద్దలు చనిపోకముందు తమ కుటుంబకార్యము లను కట్టుదిట్టముచేయుట మంచిది.

౭వది- కొందరు మిక్కిలి సంపాదించినప్పటికిని వారు కనిన పిల్లలయినా, వారిసంపాదన పుచ్చుకొనే బంధువులయినా వారు చనిపోయినతరువాత వారిధ నమున్ను తీసుకొనుటకు జాగ్రతగానుందురు. అయితే

వారి యాత్మకు మేలుచేయుటకు తలంచుదురో లేదో యని తెలియదు. కాబట్టి ఒకడు ప్రయాసపడి కావలిసినమట్టుకు సంపాదించుచున్నపుడు తనమరణానంతరము తనయాత్మకు మేలు యేమిచెయ్యానియెడల మంచిదికాదు. పయివారు చేతురని నమ్మక తాను మృతినొందకముందే అందుకు కావలసినమట్టుకు జాగ్రతపడుటమంచిది. మరణమునకుముందే దానిని నెరవేర్చుట మిక్కిలి మంచిది. అట్లుకానియెడల పద్ధతిప్రకారము మరణశాసనమువ్రాయించి అందుకు కావలసిన వన్నియు చేయవలయును. అయినను అట్టికార్యములలో తలంచవలసినదేమంటే తనమరణమునకు పిమ్మట తనయాత్మకును మేలుగా పూజచేయించుటకయినా, మరియేధర్మ కార్యములకయినా సొమ్మునుగాని రాబడినిగాని నిర్ణయించినయెడల తమ ఉద్దేశములనుసరిగా నెరవేర్చు గురువులవద్ద ఆసొమ్మురాబడి మొత్తమును సరిగా చెల్లించి వ్రాయవలసినది. అట్లు ధర్మకార్యములను నెరవేర్చుటకు సొమ్మయినా రాబడి అయినా తన పిల్లలవద్దగాని, బంధువులవద్దగాని వుంచి నెరవేర్చునట్లు వ్రాయించినయెడల వారినిబాధించును. ఎలనంటే అట్టిసమయములో పిల్లలును, బంధువులును చనిపోయినవారి ఉద్దేశప్రకారము కొంచమయినా నెరవేర్చినయెడల గొప్పకార్యమే. వారు ధనాశచేత

అవన్నియు సరిగా నెరవేర్చక వదిలివేయుటవలన కీడు కలుగుటయేకాక ఆమరణశాసనము వ్రాసినవారియాత్మకు కావలసిన మేళ్లు జరగకుండాపోవును. అట్లుతరుచుగా సంభవించినది మరియు అట్టిమరణసాధన చట్టములు నిర్విఘ్నముగా నెరవేర్చునట్లు అవి తనసంకటములో పాపసంకీర్తనము ఇచ్చేగురువులవలననయినా ఆత్మగురువు, విచారణగురువు వీరివలననయినా వ్రాయకుండా మేత్రాణులవారిపేరుచేత లేక సాధారణ గురువులపేరుచేత వ్రాయించవలయును. మరియు తన పిల్లలకు ఆ స్త్రీపంచిపెట్టుటకును లేక అప్పుతీర్చుటకును, లేక ఇతరకార్యములకును విశేషజాగ్రతచెయ్యవలసియున్నయెడల మరణ సాధనములో వాటినన్నిటిని పద్ధతిగావ్రాసి నెరవేర్చునట్లు ఆలోచించవలయును.

౮వది- సంకటము కష్టసాధ్యమయినదయితే మరణఅవస్థ పర్యంతము నిరీక్షించక తెలివిగానున్నపుడే మంచి పాపసంకీర్తనముచేసి అవస్థసత్ప్రసాదమున్ను అవస్థఅభ్యంజమున్ను గయికొనవలయును. రోగి తాను వాటిని శ్రద్ధతో కోరవలయును. అయితే అతనికి ఆతలంపులేనియెడల బంధువులు వాటిని గయికొనుటకు ప్రేరేపణ చెయ్యవలయును. ఏలనంటే వాటిని తెలివిగా గయికొంటే ఆత్మకు మిక్కిలి మేలయినసహాయము అయినా వాటిఫలమును సంపూర్ణముగా

పొందవచ్చును. అవస్థ అభ్యంజనమును పాపములకు నివారణగానున్న సంకటములో కావలసిన వరప్రసాదములను గలిగించుటకు నియమించబడి యుండడమే గాక రోగికి మేలుగానున్నపుడు శరీరమునకు సౌఖ్యము గలిగించుటకు దివ్యకర్తా వలననిర్ణయించబడినది కాబట్టి ఈమేలు ఉపకారము నెరవేర్చుటకు మరణ అవస్థపర్యంతము ఉండగూడదు.

౯వది- అవస్థ అభ్యంజనము మొదలయిన దేవద్రవ్యానుమానము తాను గయికొన్న తరువాత యీ లోక ఆశ తలంపులను శక్తికొలది తొలగించి పరలోకరాజ్యములో స్వామి మాకు నియమించియున్న అపరిమిత సంతోషములను మాటిమాటికి తలంచి వాటిపయిని తమయాత్మలో భక్తి ఆశ పుట్టించుటకును, ఆమోక్షరాజ్యములో చేరుటకును కోరికగానుండవలయును. అందునగూర్చి కళ్యాణ గుణస్వరూపియగు సర్వేశ్వరునిచూచుట ఎంతో సంతోషముఅని వారుప్రేమించుటకు ఎంతో పాత్రులుగానున్నారనిన్ని, మాకు ఎంతో మేళ్లు చేసినవారనిన్ని తలంచి వారిపయిని తనయాత్మలో దైవభక్తిప్రేమను వృద్ధి చేయవలయును. మరియు తాము గయికొనిన అవస్థ అభ్యంజనము మొదలయినవాటి ఫలమును సరిగా కాపాడి సర్వదా ఆత్మశుద్ధితోనుండవలయును. ఒకా

నొక సమయములో శాంతములేని యెడల ఇతరమయిన తంత్రములవల్లనయినా, తన తలంపుచేతనయినా తప్పువున్న యెడల దానిని వారించుటకు తిరిగీ గురువులను పిలిపించి మంచి పాపసంకీర్తనము చేయవలయును. మరియు సర్వేశ్వరుడు తనకు సౌఖ్యము గలుగచేస్తే వారికి స్తోత్రముచేసి సేవచేయవలయును. వారు పిలిపించుటకు ఇష్టపడిన యెడల భక్తి విశ్వాసములతోను, సంతోషమయిన దేవప్రేమతోను వారి పాద సన్నిధికి చేరుటమేలు.

**Nihil Obstat**

**H. PEZZONI.**

PRINTED BY B. K. SWAMY, AT THE VANI PRESS, BEZVADA,-1913.

